# వాణి

22—1—62

ఫిబ్రవరి 1-15 కార్యక్రమాలు

విడి ప్రతి వెల :
35 నయాపైసలు

ప్రచురణ ప్రతి నెలా
7, 22 తేదీలు

ఆల్ ఇండియా రేడియో ప్రచురణ









టి. కె. గోవిందరావు
(మద్రాస్, ఫిబ్రవరి 4)



భగవతీచరణ్ వర్మ, రచన నాటిక-ఖాకేపావే
(అఖిలభారత నాటక కార్యక్రమము, ఫిబ్రవరి 15)



ఎస్. బాలచందర్: వీణ (మద్రాస్, ఫిబ్రవరి 13)



టి. వి. రామన్, టి. వి. లక్ష్మణన్ (మద్రాస్, ఫిబ్రవరి 11)



బూదలూర్ కృష్ణమూర్తిశాస్త్రి: గోటువాద్యం (మద్రాస్, ఫిబ్రవరి 5)



పారశాల పొన్నమ్మాళ్
(మద్రాస్, ఫిబ్రవరి 8)



గౌరీ కుప్పుస్వామి
(మద్రాస్, ఫిబ్రవరి 9)



ఎ. ఎస్. పి. అయ్యర్: ప్రసంగం (ఆంగ్లం)
(మద్రాస్, ఫిబ్రవరి 8)



ఎస్. ఎస్. శ్రీనివాసన్, వేణువు
(హైదరాబాద్, ఫిబ్రవరి 5)

**వాణి**
నెలా 7, 22-వ తేదీలలో వెలువడును.
విడిప్రతి వెల : 37 నయాపైసలు.
సంవత్సర చందా రూ. 8-40 నయాపైసలు.
సంవత్సరమునకు తక్కువ చందా
అంగీకరింపబడదు
ఇతర వివరములకు :
ఎడిటర్, 'వాణి'
ఆలిండియా రేడియో, మద్రాస్-4.



ALL INDIA RADIO



సంపుటము XIII] **వాణి** 22—1—1962 [సంచిక 17

# టాగూర్: జానపద సంప్రదాయం

అంగ్ల మూలం : డా॥ సుకుమార్ సేన్

"గంపంత బలగంకల కుటుంబములో పుట్టినా చిన్నతనంనుంచీ ఏకాకిగా వుండేవాణ్ణి" అని రవీంద్రనాథ్ టాగూర్ తన పూర్వస్మృతులలో చెప్పుకున్నారు. చదవేసే వయస్సు రాకముందు ఆయన పగలంతా సేవకుల భాగంలోని ఒక చిన్న గదిలో గడిపేవాడు. ఆ గదికి ఒక్కటే ఒక్క కిటికీ. అందులోనుంచి బయట ఒక తోటా, దాని వెనక ఒక చెరువూ కనపడుతుండేవి. రాత్రి భోజనమైన తర్వాత లోపలి గదిలో పడుకునేవాడు. అక్కడ ఒక పనికత్తె ఆయన్ను నిద్ర పుచ్చడానికి జోలపాటలు పాడేది. కథలు చెప్పేది. ఈ పాటలూ, ఈ కథలూ ఆ కుర్రవాని మనఃఫలకంపైన గాఢ ముద్రలు వేసుకున్నై. అవి మనస్సులో మూర్తి కట్టించిన రూపాలను తలుచుకుంటూ ఆయన తరుచుగా మేలుకునే వుండేవాడు. ఆ గదిలో రాత్రిళ్లు గుడ్డి దీపం ఒకటి పెట్టేవాళ్లు. గదిగోడలమీద పడే దాని వెలుగు—నీడల్లో ఆయన ఊహ బొమ్మలను చూచేది. మధ్యాహ్నం పూట టాగూర్ కేమీ పని వుండేది కాదు. సేవకుల భాగంలోని గదిలో కిటికీ వద్ద చేరేవాడు. అందులోనుంచి కనపడే దృశ్యాలమీదా వినబడే శబ్దాలమీదా ఆయన ఊహ వీరవిహారం చేసేది. పరుగెత్తే మేఘాలు అపదలో వున్న రాకుమారిని రక్షించడానికి రెక్కల గుర్రంమీద దౌడుతీసే కథల్లోని రాజకుమారుడు అని అనిపించేవి. తోటవెనక చెరువులో ఒక మూలవున్న మర్రిచెట్టు మొదలును చుట్టుకున్న చిక్కని చీకటి పొదలు రాజకుమారిని బంధించి వుంచిన భయంకర రాక్షసుల గుహలా కనిపించేవి. ఈ విధంగా మొదటినుంచీ ఆలోచనాపరుడైన ఆ బాలకుని ఊహ జానపద సంప్రదాయంచేత పోషింపబడ్డది.

## అంత్యప్రాస, లయజ్ఞానము

ఇంతేకాదు. టాగూర్ ను కనిపెట్టుకుని వుండే సేవకులలో కొందరు పూర్వాశ్రమంలో ఊరూరూ తిరుగుతూ ఇరుగు పొరుగు జిల్లాలలోని గ్రామీణులకు జానపద సంగీతం అందజేసే బృందాలకు చెందినవాళ్లు. వారిలో ఒకడు దాశరథి రాయ్ పాటలను చక్కగా పాడనేర్చినవాడు. ఆ పాటలు జానపద గేయాల బాణీలో జనాకర్షకంగా వుండేవి. అతను ఆ పాటలను తరుచుగా టాగూరుకు పాడి వినిపిస్తూ వుండేవాడు. టాగూర్ మనస్సులో చిన్నతనంలోనే అంత్యప్రాసల జ్ఞానమూ లయజ్ఞానమూ కుదురుకోడానికి ఈ పాటలే

## ఈ సంచికలో

ముఖచిత్రం: అదిమవాసులు
(ఫిబ్రవరి 8-వ తేదీ ఆకాశవాణి వివిధ కేంద్రాలనుండి షెడ్యూల్ తరగతులు, జాతులు అనే రూపకాన్ని వినవచ్చును.)

కారణం వీటిలో కొన్ని పద్యాలూ పాటలూ ఆయన పసిహృదయానికి ఎంత ఆనందం కలిగించేవంటే, ఆయన చాలా కాలం తర్వాత వ్రాసిన కవిత్వంలో కూడా వాటిలోవి కొన్ని పాదాలు దొర్లుతూ వుండేవి. 'చిటపట చినుకులుపడ్డాయి, చిన్నీ వాగులు పొంగాయి' అనే ఒక పద్య పాదం అర్థవంతంగా కాళిదాసుని మేఘదూత మొదటిసారి చదివినప్పుడు కలిగి నంత ఆనందాన్ని కలిగించేదని ఆయన చెప్పాడు. ఆ పాదం వున్న పద్యాన్నంతా తన తొలి రచనలోని ఒక పరిణతి చెందిన పద్యకావ్యంలో ఆయన వాడుకున్నాడు. ఒక జానపద గాథకు చెందిన ఇంకొక పద్యం వుండేది. దాని సారం ఈ క్రింది ద్విపాదిలో నిలిచి వుంది.

"పరుల్ సోదరి పిలుస్తుంది, సప్త
చంపా సోదరులారా,
నిద్దుర లేవరే,
చంపక సోదరులు జవాబిస్తున్నారు,
ఎందుకు మమ్మల పిలిచేవ్,
పరుల్ పి సోదరి?"

ఈ కథ బెంగాలీ పిల్లలకు ఎప్పుడూ చాలా ఇష్టమైంది. బాల టాగూర్ హృదయ ఫలకం మీద ఈ కథ ఎంత గాఢంగా హత్తుకున్నదంటే తన ముప్పయ్యవ యేట వ్రాసిన ఒక ఉదాత్త కావ్యములో

[తరువాయి 54వ పుటలో]

కథానిక:

# కడుపునిండే కథ

అవసరాల రామకృష్ణారావు

మొదట పిల్లలూ, తరవాత మొగాళ్లూ భోజనాలు అయిపోయాక ఆడవాళ్ళంతా భోజనానికి కూచున్నారు.

"అదేంటి కమల రాలేదేం?" కమలా ...కమలా .... అని భోజనాల గదిలోంచే వెంకమ్మగారు కూతుర్ని కేకేసింది

"ఆవిడగారికి [illegible]ఒచ్చిందట" అంది చిన్నకోడలు లక్ష్మి [illegible]

"అయ్యో-తీరా పప్పు అన్నం కలిపేసుకున్నావే.... పోనీ నువ్వెళ్ళి పిలుచుకురా సూరీడూ...." అని వెంకమ్మగారు అంటే—

"ఉండండి నే వెళ్ళొస్తా ..." అని రాముడు లేచివెళ్ళింది అయిదు నిముషాల్లో తిరిగొచ్చింది వస్తూ కబురు తీసుకొచ్చింది.

"పొద్దుట ఏదో తిందిట" ఆకలి లేదుట కొంచెం. నెప్పయ్యాక వస్తానంది.... మనల్ని తినెయ్యమంది

"చిన్నక్క పొద్దుట ఏంతిందో నాకుతెలుసు" అంది సూరీడు.

"ఎవరిచేత తిందో కూడా నాకు తెలుసు" అంది రాముడు

"నోరు మూసుకుని ముందు భోజనాలు కానియ్యండి" అని కసిరేసింది వెంకమ్మగారు.

భోజనాలయ్యాక వెంకమ్మగారు కూతుర్ని పిలిచింది. కమల గది తలుపయినా తియ్యలేదు. ఆవిడ పిలిచి పిలిచి విసుగెత్తి మధ్యవసారాలో చేరి అక్కడున్న వాళ్ళతో ఆ కబురూ ఈ కబురూ చెబుతూ నెమ్మదిగా నడుం జేరేసింది.

మరో అరగంటకి కమల గది తలుపు తీసుకుని యివతలికొచ్చింది. బాత్‌రూంలోకివెళ్ళి మొహం కడుక్కుంది. కొంత సేపటికి ఒకగ్లాసు పట్టుకుని "అత్తా, ఇందులో కొంచెం మజ్జిగ పోస్తావా?" అంటూ వంటింట్లోకి వచ్చింది. కాంతమ్మ కమల తండ్రి చెల్లెలు ఆవిడ భర్త పోయిన దగ్గర్నుంచీ వీళ్ళ యింట్లోనే ఉంటోంది

"అలాగే. ఇంకో గ్లాసు కూడా తీసుకురా ఏకంగా తాగుదాం" అంది కాంతమ్మ.

కమల ఆశ్చర్యంగా ఆవిడ మొహంలోకి చూసింది.

"అదేవిటత్తా అప్పుడే ఒంటిగంటయిపోతోంది —నాకోసం నువ్వా భోంచెయ్యకుండా కూచుంటే.... మళ్ళీ నువ్వు ఈ ఎంగిళ్ళన్నీ తీసుకుని యిల్లు కడుక్కుని ఓగడీ పడుకునేదెప్పుడు? మళ్ళీలేచి రాత్రికి వంట ప్రయత్నం కోసం చాకిరీ చేసుకునేదెప్పుడు?"

"నిజమే కాని ఆమాత్రం జ్ఞానం వుంటే ఇదివరకే భోజనానికి వచ్చేదానివి. అందుకనే నిన్ను చూస్తుంటే నాకు నీమీద ఉన్న అభిమానం యిలా ఎల్లకాలం నిలబడుతుందా అని అనుమానము కలుగుతుంది."

కమల కళ్ళనిండా చూస్తుండగా నీళ్లు నిండిపోయాయి

"నువ్వు కూడా అలా అంటే నేనేమైపోవాలి అత్తా? పోనీ జరిగిందంతా నువ్వే చూస్తున్నావ్ కదా! తప్పెవరిదో నువ్వే చెప్పు"

"ఎవరిదే తప్పు అయినదానికీ కాని దానికీ కన్నీళ్ళు పెట్టుకోడం అనేది చేసే అనర్థమైనతప్పు. అట్టే మాట్లాడక ముందా పీటమీద కూచో."

కమల మంత్రముగ్ధలా కాంతమ్మ చెప్పినట్టే చేసింది. తలవంచుకుని కన్నీళ్ళని పైటకొంగుతో తుడుచుకుంది.

అవును .... కాంతమ్మత్త చెప్పింది నిజమైన మాట .... కానుకి కొరగాని కన్నీళ్ళు.... కట్టుకున్న మొగుడిదగ్గర యివి పనికిరాలేదు కనిపెంచిన తల్లి దగ్గర ఇవి కలిసిరాలేదు

పాతికేళ్ళు కూడా రాకుండా ఎమ్మెస్సీ ప్యాసయిన మొగుడు. ఉన్న వాళ్ళింట్లో పెరిగినా అన్నిపనులూ వచ్చిన భార్య. మబ్బులో గాలిలా, గాలితో తరగలా, తరగలో నురుగులా వారి సంసారం హాయిగహాయిగా సాగిపోయింది. అంతలో వచ్చి పడింది!

ఆయన ఒకనాడు హడావిడిగా చెప్పుకొచ్చారు

"కమలా, కమలోయ్....కబురోయ్ కబురూ...."

"చెబుదురూ."

"మాతమ్ముడికి యం.బీ.తో సీటొచ్చిందట...."

"బాగుందండీ హార్దిక కంగ్రాచులేషను.....మీతోపాటు నావి కూడా వెంటనే వైర్ చేయండి"

"అదెప్పుడో జరిగిపోయింది...."

సుబ్బారావు కమలదగ్గరగా వచ్చి భుజాలు పట్టుకున్నాడు

"... నాతోపాటు నువ్వూ నీతో పాటు నేనూ తప్ప విడివిడిగా మనం ఎప్పుడూ లేంగా.... అవునా!"

కమలహృదయం ప్రేమతో నిండిపోయింది. ఆయన స్నేహితుడు రామకృష్ణారావు రాసినపాట జ్ఞాపకం వచ్చింది.

"నువ్వే అద్దం. నేనే అందం

వేరేకలదా అమలం, గంధం?"

"అన్నేమో ప్రొఫెసరు....తమ్ముడేమో డాక్టరు... యింక తమరికి పట్టపగ్గాలు ఉండవు కాబోలు" అంది కమల నవ్వుతూ.

"నాకు అంత కొత్తకాదు గాని ....ఇన్నాళ్ళూ ఆ హోటలు మెతుకులు తినితిని అన్నానికి మొహంవాచిన మాతమ్ముడికి వదిన చేతి అమృతాన్నం తినేగానే పట్టపగ్గాలు ఉండవేమోలే...."





సుబ్బారావు మరింత దగ్గిరిగా వచ్చి కమల మొహం చూశాడు. ఆమె మొహంలో అతనికి కావలసిన భావం కనబడక — అటువంటివి అగుపడక కంగారు పడ్డాడు.

"మాటాడవేం కమలా?"

కమల మొహం దించేసుకుంది. సుబ్బారావు బలవంతంగా మొహం ఎత్తేడు.

"వాడు మనింట్లో ఉండి చదువుకోడం నీకిష్టంలేదా? ఇష్టంలేదా?" సుబ్బారావు మళ్ళీమళ్ళీ అడిగాడు

ఆమె జవాబు చెప్పలేదు.

అతడు కమలని జవాబు చెప్పమని బలవంతాన తల పైకెత్తాడు. అంతలో అంతలా ఆమొహం ముడుచుకు పోవడంచూసి అతని ఆశ్చర్యానికంతులేకపోయింది.

"మనిద్దరం ఒకటి అన్నారు. మన మనసు ఒకటి అన్నారు.... నా మనసులో మనసు మీకు తెలీదా? జవాబు మీరే ఊహించలేరా?" అంది కమల నిశ్చలంగా, నిశ్చయంగా.

సుబ్బారావు మనసు చివుక్కుమంది. కొండంత అతని ఆనందమూ చూస్తుండగా చెదపురుగులగుట్ట అయినదా అనిపించింది అతనిలో మొగతనం అప్పుడే మేల్కొన్నట్లు మాట్లాడ్డం ప్రారంభించాడు

"నువ్విలా అంటావని అనుకోలేదు....సమయం వచ్చినప్పుడు నువ్విలా తేలిపోతావని కలలోకూడా ఊహించలేదు....ఛీ .... నీమొగుడి తమ్ముడికి గుప్పెడు అన్నం పెట్టడానికి మొహామొహాలు చూసుకుంటున్నావు....నిన్నని ఏంలాభం?....నీకు లేనిపోని అంతస్తు ఇచ్చిన వాడి తప్పు అయినా నీతో సంప్రదించడమే మిస్టే లేకపోతే?"

ఇన్నేళ్ళ కాపురంలోనూ ఏనాడూ ఎరగని ప్రతి కఠినమైన మాటా కమల భర్తనోట వింది. వినివిని ఆమె మనసు తిరగబడింది.

"చూడండీ, మీరు తొందరపడి మాట్లాడ్డం ఏం బాగులేదు... ఒక్క నిముషం ఆగి నా మాటకూడా వినండి కాస్త ఆలోచించండి....మనం కనీసము అయిదేళ్ళ పాటయినా పిల్లలు కూడావద్దనుకున్నాం....సంతానాన్ని "[illegible]"గా భావించగలిగినంత పరిపూర్ణమైన ప్రేమ మనది....ఇందులో ఎవరికే చోటులేదు. కూడదు కూడా .. ఇదిలాపరిమళించ నియ్యండి....నామాటవినండి....మరిదికి సీటు దొరికి ఈ ఊరు వస్తాడంటే ఎంత ఆనందించానో నాకే తెలుసు మీ జీతములో ప్రతినెలా వంద రూపాయలు అతని హాస్టలుఫీజుకట్టినా నేను అడ్డు పెట్టను....కాని...."

"అక్కర్లేదు... మన దయాధర్మ భిక్షలు వాళ్ళకేం అవసరంలేదు... నీ రికమండేషను అంతకంటె అవసరం లేదు....నాకసలు అవసరంలేదు."

కమల చెంపల్ని తుడుచుకుని తల పైకెత్తి కోపంగా సూటిగా మొగుడి వైపు చూసింది!

"అంతేనా? నా అవసరం అంతవరకేనా?" అని అడిగింది.

"అవును అంతవరకే.... అంతకు మించియిస్తే ఆడది నిలబెట్టుకున్నదెప్పుడు గనక?.. నువ్వు నామాట కాదన్నావు కనక అప్పుడే వాణ్ణి పెట్టేబేడా పట్టుకని రమ్మని వైరు చేస్తున్నాను, ఎవరు అడ్డొస్తారో చూస్తాను?"

కమల అభిమానం దెబ్బతింది ఆమె అహంభావం కట్టతెగింది

"అలాగే....ఇంకా మెయిలుకు అరగంట టైముందిగా....పెట్టేబేడా సర్దుకుని నేనే మావాళ్ళింటికి వెళ్ళిపోతున్నాను, మీ వాళ్ళందరూవచ్చి మీరూమీకూ కలిసి గంగలో దిగినా నా కభ్యంతరం లేదు, నేనిప్పుడేవెళ్ళిపోతున్నాను. ఎవరడ్డొస్తారో నేనూ చూస్తాను"

ఇక చెప్పేదేముంది, భర్తకంటె ముందు తనే పంతం నెగ్గించుకుంది. కమల పుట్టింటికి రాగానే అమ్మమ్మ చేసిన వ్యాఖ్య రికార్డు కాతగినది

"అవ్వ! ఆడబడుచు నౌకర్లకి కూడా సలాంకొట్టి ... అత్తగారి పీడకు కూడా హడలి దండంపెట్టి....భర్త ఏ చీకటివేళప్పుడో ఎవరూ చూడకుండా పలకరిస్తే అదే మహాప్రసాదమని మురిసిపోయే మారోజులుపోయి ఈరోజులొచ్చాయా! ఎంచిత్రమే నాతల్లీ తమ్ముణ్ణి తన దగ్గిరుంచుకోవడంకోసం నీభర్త నీకుచేసిన మహాపరాధ మయిపోయిందా? నీలాంటిదాంతో సంప్రదించినందుకు మొదట ఆ దవడను చావగొట్టాలి" అంది అమ్మమ్మ.

మరో విధంగా మరోమాటలతో అమ్మా నాన్నా, అన్నయ్యా అందరు ఆయన్నే సమర్థించారు కాని తనది తప్పని తన మనసుకి ఎవరూ నచ్చచెప్పలేకపోయారు, కమల తల ఎత్తి చూసేసరికి ఆకునిండా అన్నం ఆధరువులూ కనిపించాయి.

"ఒక్క విస్తరే వేశావేం శాంతమ్మత్తా, నువ్వు తినవా?"

"నువ్వు తిన్నాక."

"అలాగయితే నే నసలు తినను ఇద్దరమూ కూడా కూచుని తిందాం..."

శాంతమ్మ మరో విస్తరివేసి అన్నీ దగ్గర పెట్టుకుని తనూ కూచుంది.

"ఇంట్లో ఏ ఒక్కరికీ పట్టలేదు, నేనంటే నీకు ఎందుకింతయిది అత్తా?"

"నేనే చెబుదా మనుకుంటున్నా! చెప్పవలసిన అవసరం కూడా ఇదే.... నేను చెబుతూ ఉంటాను, నువ్వు అన్నంతింటూ ఉండు....ఈ నిర్భాగ్యురాలు మొగుణ్ణి ఏ వయస్సులో పొట్టన బెట్టుకుందో నీకు తెలుసా కమలా,"

అనుకోని ఈ ప్రశ్నకు కమల తట్టుకోలేకపోయింది. ఆమె చేతిలో పిడచ గడ్డకట్టుకుపోయింది, ఆమె

నోట్లో మాట పెడవగట్టుకు పోయింది.

"చిన్నన్నయ్య నా పదహారో ఏట యిక్కడికి తీసుకొచ్చాడు. మొట్టమొదట్లో ఎంగిళ్ళు తియ్యడం, కాఫీలు కలపడం... అందరికి ఓ పూట వండడం చివరికి ఇప్పటిల్లా అత్తా! లా అన్నీ ఈ వంటయిల్లే నాకు అయిపోయింది.... పనిపాటలలో అలసట కలిగేది. అనుకోకుండా అలా అలా రోజులు దొర్లిపోయేవి.... జీవితంలో ఏ భావమూ లేకుండా అప్పుడప్పుడు అన్ని సంవత్సరాలు ఎలాగడిచాయో నాకిప్పటికీ ఆశ్చర్యమేస్తుంది ఒక్కనాడు మాత్రం నా మనస్సు ఎదురు తిరిగింది నేను అలిగింది కూడా ఆ ఒక్కనాడే. అయితే ఆ అలక జీవితం మీద అనుకున్నావ్, జీవితం మీదే....

మరేంలేదు.... ఆవాళ ఎవరో మనయింటికి భోజనానికి వచ్చారు "ఎవరండీ ఈ వంటమనిషి," అని అడిగారు. "వంటమనిషి కాదు లెండీ, ఇంట్లోమనిషే" అంది మీ అమ్మ అంటూ తెల్లబోయిన నన్నుచూసి ఫక్కున నవ్వింది నడిన నవ్వేనా బాధలేదు. చిన్నన్నయ్యకూడా నవ్వేడు! ఆరాత్రి నాకు నిద్రపట్టలేదు "నువ్వు వంట మనిషివి, దాసీ మనిషివి, పనిమనిషివి" అని కొన్ని వందల కంఠాలు నన్ను వెక్కిరించాయి. గిన్నెలు తోమడం తొలచుకోడం, పప్పు నీళ్ళలో పొయ్యడం, రుబ్బడం, ఉడకబెట్టడం వార్చడం, వేయించడం, పోపు పెట్టడం.... ఇదే ఇవే ఇదే ఇదే నీ బతుకు.... ఇంతే నీ బతుకు.... ఇలాంటి భావాలు నన్ను ఏడిపించాయి. నీవయస్సు వాళ్లు ఏం చేస్తున్నారో చూడు.... వాళ్ళ సుఖాలు చూడు.... వాళ్ళ సుఖాలు చూడు. మసి కారిన నీ మొహం తోమిన పిబ్బెలో చూసుకో" అని వెక్కిరించాయి. ఎవర్నో లేవదీసుకు పారిపోవడం.... బలవంతాన ప్రాణం తీసుకోడం ఇలాంటి విషయాలపై నా మనసు మళ్ళలేదుగాని. ఆరాత్రి నేనుచెప్పలేని వ్యథ అనుభవించాను కమలా...."

కాంతమ్మ కమల విస్తరివైపు చూసి ఆగిపోయింది.

"అదేమిటి నువ్వు తింటున్నట్టే లేదూ...."

"బాగుంది, నువ్వు మాత్రం భోంచేస్తున్నావాయేమిటి అత్తా, అయినా నన్ను అర్థాకలితో లేవదియ్యడం నీకు మాత్రం ఏమంత మంచిదిలే.... నువ్వు చెబుతున్నది ముందు పూర్తిచెయ్యి అత్తా!

"ఆ మర్నాడు మనింటికి చిన్నన్నయ్య స్నేహితుడుటా ఎవరో భోజనానికి వచ్చేడు. నామనస్సు ఎంత వికలమైపోయి ఉన్నా, భోంచేస్తున్నప్పుడు వాళ్ళకబుర్లు నన్ను ఆకర్షించకుండా ఉండలేవు. ఊరూర దైవ భక్తి ప్రేరేపించే ఉపన్యాసాలిస్తూ ఆయన తిరుగుతాడు ఆ రోజున "శ్రీకృష్ణుని బ్రహ్మచర్యం" అనే విషయమ్మీద మాట్లాడ్డానికివచ్చాడుట. పురాణాలలో నాకు ఎన్నాళ్ళనుంచో అర్థంకాకుండా ఉన్న అనేక విషయాలు ఎంతో చిన్నచిన్న మాటలతో ఆయన చిన్నన్నయ్యకు చెబుతూంటే ఏదో విచిత్రమైన శక్తి నాకు తెలియకుండానే నా మనస్సును ఆయనముందు మోకరిల్లేటట్టు చేసింది. ఆయన భోంచేస్తూ అన్నాడు.

"వండుకున్న అమ్మకంటె దండుకున్న అమ్మమేలని రోజుకో ఊరిలో ఆగే నాకు—ఒకేరకం భోజనంతో తృప్తిచెందే అవసరం ఏముంది? ఇన్నిరకాల వంటకాలు చూశాను.... చెప్పకేం, నాక్కూడా అన్నిరకాలూ చేతనౌను కాని వంతులుగాయూ ఇంత రుచిగల భోజనం ఈమధ్య ఎరగను.... ఈవిడమీ....

చిన్నన్నయ్య నాగురించి ఏం చెప్పేడో నేను వినలేదు. ఆయన మాత్రం వెళ్లేముందు ప్రత్యేకించి నన్ను పిలిచి తలమీద చెయ్యివేసి "కిష్టసుఖం వంటబట్టిన మనిషివికాని నువ్వు వట్టి వంటమనిషివి కాదుతల్లీ. ఎప్పుడూ నీచేత్తో అందరికీ ఇంత అన్నం పెట్టగలుగు. అంతకంటె అదృష్టంలేదు—అన్నదాతా సుఖీభవ" అని దీవించాడు. నాబాధ ఏమయిపోయిందో తెలీదు. నేను ఆ క్షణాన ఉప్పొంగి పోయాను. ఆరోజున నాకు కలిగిన తృప్తి ఇంతని చెప్పలేను. చాకిరీచేసే వంటమనిషిగాకాక, ఇంట్లో ఇందరికి కడుపునింపే అన్నదాతగా నన్ను నేను గుర్తించుకోడం నాకు చెప్పలేని మనశ్శాంతినిచ్చింది. ఆరోజు మొదలు ఈగదిలోకి వచ్చి చిన్న పనికూడా ఎవర్నీ చెయ్యనివ్వను ఏ ముకుందమాలలో పద్యాలో నాకు వచ్చినట్టు చదువుకుంటూ, ఎప్పుడూ ఏదోపని చేసుకుంటూ ఉంటాను. కడిగిన ఈ యిల్లే నాకు చల్లని తల్లి! ఈ గచ్చునేలే నాకు వెచ్చని పరుపు! పదిమందికి వండి వడ్డించే నా కుడిచెయ్యి నాకు తలగడా! ఆ తర్వాతే నాకు నిద్రపట్టని రాత్రే లేదనుకుమా కమలా! కాంతమ్మ చెప్పుకు పోతోంది.

"కమలా! ఆధారంకోరే ఆడవాళ్ళం మనం అన్నపూర్ణలా ఆదరించి అన్నంపెట్టేకన్న మన జీవితాలకి సార్థక్యం ఏముంది?.... ఇంత పెద్దయింట్లో ఎవరికీలేని నా అదృష్టమే చూడు. "పిన్నీ, అన్నం పెడతావా?" "వదినా వంట ఉందా?" "చెల్లీ ఆకలేస్తోంది అన్నంపెట్టవే.... పెద్దమ్మా ముందునాకు అన్నం పెట్టవూ," అని పెద్దవాళ్ళూ చిన్నవాళ్ళూ అందరూ నాకంట్లో పసిపాపలై "అమ్మా ఆకలే" అని నా కాళ్లకు చుట్టుకుంటారు. అంతకంటె నాకింకేం కావాలి కమలా! అదేమిటి ఏడుస్తున్నావా?"

కమల ఎడంచేత్తో మొహాన్ని తుడిచేసుకుంది.

"లేదత్తా.... నువ్విలా మాటాడుతూంటే ఏవేవో ఎప్పుడూ తెలియని విషయాలు తెలిసి నామనసెంతో ఊరట పొందుతున్నట్టుంది. నీతో ఎంతో వాదిద్దామనుకున్నాను: కాని నీముందు మాట్లాడ్డానికే నేనిప్పుడు సిగ్గు పడుతున్నాను. ఒక్క మాట మాత్రం చెబుతాను.... కొన్ని వందల మాట్లు నీదగ్గర భోంచేశాను. కాని నీవంట యింతరుచిగా ఉంటుందని నాకెప్పుడూ తెలియలేదు సుమా!

ఇద్దరూ కలిసి నవ్వుకున్నారు.

కమల చేతులు కడుక్కుని చెక్క పొడి నోటిలో వేసుకుంటూ అంది: "చాలామంది ఆడవాళ్లకు వంట చెయ్యడం మాత్రమే తెలుసు" కాని నీలాంటి వాళ్ళకు కడుపునిండా భోజనం పెట్టడంకూడా తెలుసు.... నీదగ్గర ఇది గ్రహించాను.... కృతజ్ఞురాల్ని. ఆచరణలో పెట్టగలిగితే అదృష్టవంతురాల్ని.... ఈరాత్రికి నావంట ఎలా ఉంటుందో మరిదే చెప్పాలి.... అలా చెబుతూంటే ఆయన మొహం నేనే చూడాలి—మళ్లీ నీకే చెప్పాలి, నువ్వే వినాలి!"

కాంతమ్మ తెల్లబోయింది

"అవును.... ఈ మెయిల్లోనే నా తిరుగు ప్రయాణం నాలాంటి 'లేడీ'కి లేచిందే ప్రయాణం, నీకు తెలీందేముంది?" అంది కమల నవ్వుతూ.

# ఇటీవల దొరికిన పురావస్తువులు

మల్లంపల్లి సోమశేఖర శర్మ

గవర్నమెంటు పురాతత్వ శాఖవారు ఆంధ్రదేశములోను, ఇతర రాష్ట్రములలోను సాగించిన త్రవ్వకపు పనులవల్ల హిందూదేశ పురాతన చరిత్రను సంబంధించిన అనేక నూతన విషయములు తెలియవచ్చినవి, పురాణ వస్తువులు అసంఖ్యాకముగ బయట పడినవి.

ఈ త్రవ్వకపు పనులవల్ల తెలియవచ్చిన అతి ముఖ్యవిషయములలో ప్రధానమైనది సింధు నాగరికత వ్యాప్తి. సింధు నదీతీరమునందలి మహంజోదరో, హరప్పలవద్ద గౌర్నమెంటు పురాతత్వ శాఖవారు చాలా సంవత్సరాలకు పూర్వము జరిపిన త్రవ్వకపు పనులవల్ల విదితమైన సింధు నాగరికతను (ఇండస్ సివిలిజేషను) గురించి వినినవారూ తెలియని చదువరులూ వుండరు. అచటి నగర నిర్మాణపద్ధతి, పుర పారిశుద్ధ్య పౌర ఆరోగ్యపద్ధతులు మొదలైనవి దేశీయులనే కాక ఖండాంతర వాసులనుకూడా ఆశ్చర్య చకితులను చేసినవి.

## అయిదువేల నాటిది

ఇక్కడ దొరికిన ముద్రికల (ఇండస్ సీల్స్) మీది చిత్రలిపిని విడదీయుటకు మహా మేధావులైన పండితులు ప్రయత్నించి పరిష్కార మార్గములు సూచించినా, అది యిప్పటికీ చిక్కు విడని సమస్యగానే వుండిపోయి దురవబోధముగానే వున్నది. ఈ సింధు నాగరికత విశిరముగా యెప్పటిదో తెలియరాకపోయినా ఇప్పటికి ఈ నాగరికత అయిదువేల సంవత్సరాలకు పూర్వపుదై యుండవలెనని అంతకు తరువాతిది మాత్రం కాజాలదని కొన్ని ఆధారాలనుబట్టి చరిత్రకారులు నిర్ణయించినారు. ఈ నాగరికత సింధునదీ ప్రాంతమందేకాని ఇండియాలో మరెచ్చటనూ వ్యాపించి యుండలేదని ఇంతకు కొంతకాలం పూర్వమువరకు భావిస్తూవచ్చారు.

కాని ఇటీవల కొన్ని సంవత్సరాలుగా జరుగుతున్న త్రవ్వకపు పనుల వల్ల ఆ సంస్కృతి, ఆ నాగరికత సింధునదీ ప్రాంతానికి మాత్రమే పరిమితం కాలేదనీ, ఇండియాలోకూడా వ్యాపించినట్లు విదితమైంది. ఈ నాగరికతకు సంబంధించిన పురావశేషములు గంగా యమునా లోయలో ఢిల్లీ సమీపంలోను గుజరాతులోను, నర్మదానదీ ముఖద్వారా సమీప ప్రాంతమునను, బయటపడుట వల్ల హరప్పకి కొత్త ప్రాముఖ్యం ఏర్పడింది. హరప్పసంస్కృతికి చెందినవి దేశములోచాలాచోట్ల కానవచ్చినవి. వీటి అన్నిటిలో ముఖ్యమైనది అహ్మదాబాదు జిల్లాలోని లోథాల్‌లోనిది. ఇక్కడ ఉత్తర, దక్షిణదిశలుగాను పూర్వ పశ్చిమ దిశలుగను పోయే వీధులు, సందులు, స్నానాల గదులతోగూడిన ఇండ్లు, ఇండ్లలోని నీరు పోవుటకు ఇటికలతో కట్టిన తూము కాలువలపై నేలకు అడుగునుంచి మురుగునీరు పోవుటకు ఇటుకతో కట్టినకాలువలు. అన్నీ ఇక్కడి జనులు హరప్ప నగర నిర్మాణ, పౌరారోగ్య సంప్రదాయ పద్ధతులను అవలంబించి నిర్మించుకొన్నట్లు స్పష్టపడుతున్నది ఇక్కడ హరప్ప, మహంజదారోలో దొరకిన ఇండస్ సీల్స్, సింధు ముద్రికలవంటి ముద్రికలు చిత్రలిపి జంతుచిత్రములు గలవి దొరకినవి. గుజరాత్‌లోని రంగ్‌పూరు మొదలైన స్థలాలలో దానిలాగే ఇచటిదికూడా, హరప్ప సంస్కృతి—అర్వాచీనదశ అని భావిస్తున్నారు. ఇక్కడ ఇటికలతో నీటిలోనికి కట్టిన విస్తృతమైన నిర్మాణం కనిపించింది. ఇది ఓడలలో వచ్చిన సరకుదించి యుంచుటకు కట్టిన కట్టడము కావచ్చునని ఊహిస్తున్నారు. ఇదే నిజమయితే లోథాల్‌లోని హరప్పయుగమునాటి జనులు జరుపుతూవచ్చిన జలమార్గ వర్తకానికిది అపూర్వ ప్రమాణమవుతుంది. ఇచట నౌకానిర్మాణ స్థానముకూడా కానవచ్చినది.

## అయిదు స్ఫటిక కరండాలు

ఇదివరకు అనేక పర్యాయములు త్రవ్విన గుంటూరుజిల్లా అమరావతిలోని స్తూపప్రాంతాన నాగార్జునని కొండలో ప్రతిష్ఠాపనిస్తూండిన పురాతత్వ శాఖవారు మళ్ళీ త్రవ్వటపు పని జరిపి పరిశోధించి చూచినారు. ఈ పరిశోధనకు ఫలితంగా అదియు ధనకటక మహా చైత్యపు మౌలిక వేదిక, ఆయక కంభములుండే వేదిక బహిర్భాగము. మహాచైత్యపు ప్రదక్షిణ పథము బయటపడినవి. ధనకటక మహాచైత్యమన్నా, అమరావతీ స్తూపమన్నా ఒకటే. మహాస్తూపము వ్యాసము 168 అడుగులు—అంటే 56 గజాలు. ప్రాకారశిలారేఖ అడుగుకీలు మినహాయిస్తే ప్రదక్షిణ పథము వెడల్పు 11 అడుగులు అంటే అడుగు తక్కువ నాలుగు గజాలు. ఈ స్తూపానికి సంబంధించి ఇటికతో చప్టావేసిన నేల భాగములు, సున్నముచేసిన భాగములు, కడపరాళ్లు పరచిన నేల భాగములు, మ్రొక్కుబడి స్తూపములు మొదలైనవన్నీ ఇక్కడ బయటపడినవి. ఇక్కడ దొరికిన పురావస్తువులలో ముఖ్యంగా చెప్పవలసినవి అయిదు స్ఫటిక కరండాలు. ఇవి ప్రాకార రేఖవెంబడి ఊర్ధ్వపటములో వాటిని భద్రపరచుటకు చేసిన రంధ్రములలో దొరికినవి. ఊర్ధ్వపటమంటే నిలువురాతి కమ్మి. ప్రాకార రేఖ నిలువురాతి కమ్ములతోను, అడ్డు కమ్ములతోను నిర్మితమైనది.

## అశోక శాసన ఖండము

ఇక్కడ దొరికిన క్రీస్తుశకం రెండవ శతాబ్దినాటి ఒక శాసనము ఈ చైత్యానికి జీర్ణోద్ధారం (నవకర్మ) జరిగినట్లున్నా, మరొక శాసనము స్తూపపు దక్షిణ దిశను ధాతు సహిత చైత్యకంభమున్నట్లున్నా తెలుపుతున్నవి. క్రీస్తుశకం రెండు మూడు శతాబ్దాలకు చెందిన సున్నపు రాతి శిల్పములు, క్రీస్తుశకం 9వ, 10వ శతాబ్దాలనాటి తాంత్రిక బౌద్ధానికి సంబంధించిన విగ్రహాలు—మైత్రేయ, హేరుక, తార, ఉగ్రతారకలు—దొరికినవి. ఇవికాక బుద్ధుని జీవితానికి సంబంధించిన శిల్పచిత్రాలు సున్నముతో చేసిన జంభాల విగ్రహం వర్తులాకార పద్మముద్రిక—లాకెట్ మెడలియన్—కొన్ని స్తూప శిలాశాసనాలు ఇక్కడ దొరకినవి. స్తూప శిలాశాసనాలలోని లిపినిబట్టి చూస్తే అవి క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దినాటివి కావి, మూడవ శతాబ్దినాటివి కావి కావచ్చును. ఇందువల్ల ఈ యమరావతీ స్తూపం ఆకాలంలో, అంటే క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దంలోనో రెండవ శతాబ్దంలోనో కట్టియుంటారని చెప్పవచ్చును. ఈ త్రవ్వటములతో దొరికిన శాసనములలో ముఖ్యమైనది, ఒక శిలమీద చెక్కిన అశోక శాసనఖండము. ఈ శాసనశిలను మౌలిక మౌర్యకాలపు మెరుగుదిద్దిన అశోక శిలాస్తంభము నుంచి పగులగొట్టినట్లు స్పష్టము. దీని ననుసరించిచూస్తే యిచట పూర్వము అశోక శిలాస్తంభము వుండియుండవలెనని యూహింపవచ్చును. ఒకవేళ అమరావతీ స్తూప నిర్మాణమునకు ఆ చక్రవర్తియే కారణమైనను కావచ్చును.

## శిథిలావశేషాలు

నాగార్జునని కొండ త్రవ్వటములు యిప్పటికి పూర్తి అయినవి. ఇదివరకు బయటపడినవి కాక ఈ త్రవ్వటములలో పదులకొద్దీ బౌద్ధ నిర్మాణాలు—చైత్య గృహాలు, స్తూపాలు, మండపాలు, బౌద్ధ విహారాలు—శిల్పాలు, ఇతర బౌద్ధ శిథిలావశేషములు అనేకం దొరికినవి. ఇంతే

కాదు, పెక్కు నూతన శిలాశాసనములు హిందూ దేవాలయాలు, ఇక్ష్వాకు మహారాజుల రాజధాని విజయపురి కోట, బురుజులు, రాజసభామండపం, సోపానం, సోపాన పంక్తితో కూడిన కృష్ణానదీ స్నాన ఘట్టం, మహారాజ కుటుంబపు శ్మశాన వాటిక వైదిక క్రతుకర్మ సంబంధి నిర్మాణములు, నాణెములు, నగలు, పోతపోసిన అచ్చుబొమ్మలు, ఎర్రటివి నల్లటివి—పగిలిపోయిన రకరకములైన కుండ పెంకులు—రంగులు వేసిన కుండలవి, రేఖా చిత్రములతో అలంకృతములైనవి, మెరుగుదిద్దినవి— ఎన్నో చిత్ర విచిత్రములైన పురావస్తు విశేషములు బయలుపడినవి. ఇక్కడి విశేషమేమంటే, విజయపురి పశ్చిమభాగాన కోట ప్రదేశముతో పాటు కృష్ణానదీతీర ప్రాంతమున వైదికకర్మ సంబంధి నిర్మాణములు, దేవళములున్ను, తీరమునకు కొంత దూరమున లోపలగా ఇతర ప్రాంతమున కొండ వెలుపల బౌద్ధ విహారాది నిర్మాణములున్ను ప్రత్యేకమైన విన్యాసములో కానవచ్చినవి.

## రాజులకు వైదికప్రీతి— రాణులకు బౌద్ధప్రీతి

విజయపురి రాజధానిగా ఆంధ్రదేశమును పరిపాలించిన ఇక్ష్వాకు నరేంద్రులు వైదిక మతానుయాయులు. అగ్నిష్టోమ, వాజపేయ, అశ్వమేధాది క్రతువులు చేసినవారు. ఇక్ష్వాకు రాజకుటుంబపు స్త్రీలుమాత్రము బౌద్ధమునభిమానించి దానిని ప్రోత్సహించినవారు. వారి యౌదార్య, దానధర్మ సుగుణముల ఫలితంగానే నాగార్జునుని కొండలోయ అంతా బౌద్ధ నిర్మాణాలతో శోభాయమానమైనది. బౌద్ధ, హిందూ ధర్మ సంప్రదాయములు రెండూ ఏకకాలంలో ఇచట వర్ధిల్లుతూ వుండెననుటకు ఇచట బయలుపడిన నిర్మాణాలే తార్కాణం. హిందూ దేవాలయముల పునాదులు, గోడలు, దేవతామూర్తుల పీఠములు, మండప స్తంభములు మాత్రమే ఇపుడు మిగిలివున్నవి. ఇక్ష్వాకురాజులు మహాసేనపాదానుధ్యాతులు. అందువలన కావచ్చును కృష్ణాతీరాన కార్తికేయ విగ్రహములు—భిన్నములైనవి కొన్ని—దొరికినవి. అవి కార్తికేయారాధకుల ప్రాముఖ్యమును దెలుపుచున్నవి. కార్తికేయునియం, పుష్పభద్ర స్వామియను పేర మహాదేవాలయం, సర్వదేవాలయం ఇచ్చట కృష్ణాతీరాన వున్నవే. ఇవి కాక కృష్ణాతీరమున. దే ఇక్ష్వాకరాజుల నాటి మూడు దేవమందిర నిర్మాణములు, వాటిలో ఒకదాని ముందు ధ్వజస్తంభము బయలుపడినవి. వీటిలోనే ఆ కాలపు లిపిలో పెద్దశాసనం చెక్కిన పెద్ద శిలాఫలకం, శ్రీకాకుళం జిల్లా శాలిహుండాములోవలె కానవచ్చుగల రెండు శంఖాలు, ఆరాధించుటకు కమలం చేతితో పట్టుకొన్న ఒక ప్రభువు బొమ్మ చెక్కిన బంగారు రేకు కూడా దొరికినవి.



## ఉజ్జయిని కంచరి

పెద శిలాఫలకం మీద చెక్కిన శాసనం ఇక్ష్వాకుకాలం నాటి లిపిలోనే ప్రాకృత భాషలో వున్నది. వాసిష్ఠీపుత్ర వసుషేణుడనే పేరుగల అభీర నరపతి తన రాజ్యకాలం తొమ్మిదవ యేట అష్టభుజస్వామి అనే పేరుతో బొమ్మలం దారుమయ విష్ణు విగ్రహాన్ని ప్రతిష్ఠించినట్లు తెలిపే శాసనం ఇది. మహాతలవర, మహాగ్రామిక, మహాదండనాయక, కౌశిక గోత్ర శివసేనుడు, సంజయపురి యువరాజ కుమారులు, అవంతి రుద్రదమనుడనే శకజాతీయుడు; వనవాసి విష్ణురుద్ర శివలానంద సాతకర్ణి అనేవారు ఈ ప్రతిష్ఠలో పాల్గొని స్వామికి దాన ధర్మాలు చేసినారు. అక్కడ దొరకిన శంఖాల మీద చెక్కిన శాసనాలన్నీ ఇక్ష్వాకుల నాటివే ప్రాకృతభాషలో వున్నవి. ఒక శంఖం మీద శాసనమే కాక ఒక అష్టాన పీఠంమీద ఒక ధ్వజస్తంభమును, దానికి ఇరుపార్శ్వములందు ఒకవైపు అంకుశము, మరొకవైపు ఛత్రమున్ను చిత్రితమైనవి. ఈ శంఖం మీది శాసనమిది "భగవతో అరభుజసామిస" (భగవంతుడైన అష్టభుజ స్వామియొక్క అని యర్థం) రెండవ శంఖం మీద "ఉజ్జేన కణసరి" అని చెక్కవున్నది— అంటే ఉజ్జయినీ కంచరి అన్న మాట. బహుశః ఈ శంఖంమీద ఈ బొమ్మను, శాసనమును చెక్కినవారు ఉజ్జయినినుంచి వచ్చిన కంచరి కావచ్చును: అభీరవసుషేణుడు కాశ్రితు డగునేమో. అభీర నృపాలుడు ఇక్కడికి ఎట్లు, ఎప్పుడు వచ్చి రాజ్యం చేసెను అనే కొత్త సమస్యను తెచ్చిపెట్టింది శిలాఫలకం మీది శాసనం. అభీర వంశజులు పశ్చిమసముద్ర (అరేబియా సముద్ర) తీరస్థ దేశం పాలించినవారు. దాని పరిశోధనవల్ల ఈ సమస్య పరిష్కారం కావలసి వున్నది.

నాగార్జునుని కొండ ఉత్తరదిశను ఏటవాలు ప్రదేశములో కృష్ణాతీర ప్రాంతమున ఇక్ష్వాకు రాజకుటుంబం వారి శ్మశాన ఘట్టావశేషములు కొన్ని బయలుపడినవి. ఈ ఘట్టము మూడు విభాగములుగా ఉన్నది. కూర్చుండుటకు ఏర్పాటు తోనూ, మూలలందు బానకంబాలతోను, మరుగుగా వుండుటకనువైన మండపాలతోను గల పెద్ద స్తంభాల శాలలు మొదటి విభాగంలో ఉన్నవి. ఈ విభాగంలో నిచ్చెన వేసుకొనియున్న స్త్రీ విగ్రహము అగ్నిప్రవేశము చేయుటకు సంసిద్ధముగ నున్నట్లున్నది. అప్పటికే సహగమనాచారము ఉండెనో యేమో. ఈ విభాగానికించుక ఎడమటగా కొంచెం మిత్తున ఉన్నది రెండవ విభాగం. దీనిలో అపరకర్మలో ఉపయోగపడే పెద్ద కుండలు, చనిపోయినట్లు పడియున్న స్త్రీ విగ్రహము బయటపడినవి. మూడవ విభాగంలో ధ్వజస్తంభ సహిత శిథిల దేవాలయం ఉన్నది. ఎహా వుల దాంతమూలవి గూర్చినవో ఏమో—ధ్వజస్తంభం మీద చెక్కి వుంది.

యుద్ధములో చనిపోయిన ప్రసిద్ధ యోధుని నిమిత్తము, రాజకుటుంబపు రాణుల నిమిత్తం ఎత్తించిన స్మారక స్తంభములు—మెమోరియల్ పిల్లర్స్ చాల దొరికినవి. వీటిని ఛాయా స్తంభము అన్నారు. నాగార్జునుని కొండ త్రవ్వకములు ఆంధ్రదేశ చరిత్రలో మరుగుపడిపోయిన ఒక ప్రకరణమునే కాదు ఒక యుగపు ఆంధ్రదేశ నాగరికతను, సంస్కృతిని తెరచి చూపినవి.

[సంక్షిప్తం]

# 'Vani' Advertisement Rates

**ORDINARY POSITION:**

| | | |
|---|---|---|
| Casual: 1" to 99." | ... | Rs. 7/- per column inch |
| Contract: 100" & Over | ... | Rs. 6/- per column inch |

**SPECIAL POSITION:**

| 2 & 3rd COVER | | *Casual.* | *Contract.* (minimum of 4 insertions of an equal size.) |
|---|---|---|---|
| Full Page | ... | Rs. 300/- | Rs. 250/- |
| Half Page | ... | Rs. 155/- | Rs. 130/- |
| **4th COVER** | | | |
| Full Page | ... | Rs. 370/- | Rs. 310/- |
| Half Page | ... | Rs. 190/- | Rs. 160/- |

**SOLUS POSITION (3" x 2" Cols.)**

| | | |
|---|---|---|
| (i) First reading matter page | ... | 100% extra on basic rates. |
| (ii) Other reading matter and programme pages | ... | 50% extra on basic rates. |
| Specified positions in reading matter and programme pages | ... | 25% extra on basic rates. |

**PANELS (2" x 4" Col.)**

| | | *Casual.* (1 to 12 insertions in a year.) | *Contract* (13 & more insertions in a year.) |
|---|---|---|---|
| (i) First reading matter page | ... | Rs. 85/- per insertion | Rs. 70/- per insertion. |
| (ii) Other reading matter and programme pages | ... | Rs. 70/- per insertion | Rs. 60/- per insertion. |

**EAR PANELS (2" x 1 Col.):**

| | | | |
|---|---|---|---|
| First page only per panel | ... | Rs. 30/- per insertion | Rs. 25/- per insertion. |

*Note:* Instructions, orders, advertisement materials, remittances e.c. to be sent to the "Editor, Vani, All India Radio, Madras-4.

*Further details may be had from:—*

Editor, Vani, All India Radio, Madras-4.

# శ్రీపాద కవిసార్వభౌములు

వాజపేయాజుల రామసుబ్బారాయుడు

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు బాల్యమునుండియు విశేష పరిశ్రమలకు లోనై, వేదము నభ్యసించి, శాస్త్రమును జదివి, శ్రౌతమును బఠించి, గీర్వాణమునందుఁ గవిత్వముఁ జెప్ప నేర్చి, శతావధానములను బెక్కుఁ జేసి, విశేష లోకానుభవము గలిగి శ్రీనాథున కీడువచ్చు, సత్ప్రతిభను నార్జించి యతనితో సరివచ్చు ననవచ్చు. సంస్కృత జటిలంబై, ముద్దులొలుకు శైలిని సలక్షణంబగు నాంధ్ర కవిత్వమును, జెప్పనేర్పును గడించి, రసవంతంబగు పెక్కు కృతులు నిర్మించి సారస్వత మహాలక్ష్మికి వలయునన్ని యలంకారములు దొడిగి కావలసినన్ని కీర్తి, స్థిరైశ్వర్యముల నార్జించి కృతార్థులైరి.

శ్రీ శాస్త్రిగారు పావన గౌతమీ నదీతీరమున వెలసిన, రాజరాజ నరేంద్రుని పట్టణమగు రాణ్మహేంద్రమున నివసించిరి.

మొత్తముపైన, రెండువందల కృతులను నిర్మించిరి.

## యోగ్యత గొప్పది

కవులలో విన్ని కృతులు నిర్మించినవారు లేరు. దైన్యము లేని గోత్రమున నుద్భవించిరి. ఉన్నంతలోఁ దృప్తి కలవారు. ఎన్నఁడుఁ జేసాచి యెఱుఁగనివారు యోగ్యత గొప్పది. సదాచార సంపన్నులు. ఆజానుబాహులు. ఉదారధార గలవారు. జ్ఞానయోగి. రాజాశ్రయము



బొత్తిగా విష్టపడనివారని, యీ దిగువ నుదహరించిన వారి పద్యమువలన, వారి పవిత్ర జీవితం తెల్లంబగు.

ఉ. దైన్యము లేని గోత్రమునఁ దండ్రియు
దాతయుఁ దాత తాతయున్
మాన్యతఁ గాంచి రేను నొక మానిని
కంజలి సేసి మ్రొక్కి సా
మాన్యుల రీతిఁ బొట్టకయి మానవ
వాధుల నాశ్రయించుటల్
ధన్యముగాఁ దలంపని మతంబున
నుండెడివాఁడ గృష్ణుఁడన్.

దేశదేశములఁ జెన్నలరారు వధానములను జేసిరి. వారి కళాధ్యానము చిత్రచిత్రమగు పద్ధతి నొప్పుచుండెడిది. వైదిక ధర్మతత్పరులు. తదాచార కాండలో రెండవ ప్రవరాఖ్యుఁడు. ధైర్య స్థైర్య గాంభీర్య గుణములో రెండవ కృష్ణుఁడే. సృష్టికిఁ బ్రతిసృష్టి చేయఁగల కవిసార్వభౌముఁడు. వీరి వివిధ ప్రబంధములయందుఁ బాత్రికవుల కళా సౌందర్యముఁ దెల్లంబగు. వేయేటికి? కవనార్థం బుదయించిన వారన్న నతిశయోక్తి కాదు.

## మహాపురుషుఁడు

ఎన్నియో పురాణములను దెనిగించిరి. ఒక్కచేతిమీదుగా, రామాయణ, భారత, భాగవత గ్రంథములను వ్రాసిరన్న వారి రచనా సామర్థ్యము, కవితా కళా సౌందర్యము, యోగ్యత, ప్రజ్ఞా విశేషములు చెప్పకచెప్పు. రామాయణ రచనముచే, నపర వాల్మీకియై, రాముఁడై, కీర్తిఁ గాంచె. భారత రచనమువలన రెండవ వ్యాసుఁడై, కృష్ణుఁడై విరాజిల్లె. భాగవత కృతివలన నపరపోతనయై త్రిమూర్త్యాకారంబునఁ దేజరిల్లె.

"దుర్గమర్థజల గౌరవభారత భారతీ సముద్రముఁ దరియింగ నీదిన" మహాపురుషుఁడీ కృష్ణుఁడు.

ఉ. అన్నరిసోదరాళి బవుఁదాంకటి
వాఁడొక మూడుపక్షముల్
నన్నయ భట్ట ముఖ్య కవినాయకు
లట్టిన, మూడు నూర్ల యేం
డ్లిన్నవభారతాబ్ధిఁ దరియించి యెటో
చరితార్థులై; నే
నన్ననొ, వారి పాదరజమట్టిరఁగాను
ముహాళ యెట్టిదో!

ఉ. వాగనుశాసనాది కవివర్యుల దెక్కడ
మూఁడులాడుచో
నాగెను నేవి దెక్కడ? మహామహి
భారత వేదపర్వతం
బీగతిదాటు టెక్కడ? వినీయుమ
వంతయు జంకనైతిఁ దె
వ్వాగము కోఁడఁ గొట్టుకొన నాగతి
యేమహా ఓఁగ లాగునన్.

శాస్త్రిగారికె గురుబ్రహ్మ

భారత రచనా ప్రారంభమున శాస్త్రిగా రిట్లు వ్రాసియు సంకల్పించిన కార్యము, మానరానను దీక్షతో వ్యయప్రయాసంబులను సరకుగొనక—కాశి, కలకత్తా మహాపట్టణములకుఁ బోయి యచట గల సంస్కృత భారత ప్రతులను సంగ్రహించి, విమర్శించి, యామూలాగ్రముగఁ దెనిగించి పదునైదేండ్లలో ముగించిరన్న శాస్త్రిగారి పట్టినపట్టు యెంతటి శక్తి కలదో, లోక మూహింపక పోదు. శ్రీనాథ కవి సార్వభౌముని ప్రతిభకు. చిత్తసైక్యమునకు నెందును దీసిపోవువారు కారు. శ్రీనాథ కవి సార్వభౌముండే, మన శాస్త్రిగారికి గురుబ్రహ్మయని యీ దిగువ పద్యము సాక్ష్య మిచ్చుచున్నది.

శా. నేనేనాని కవిశ్వ మెవ్వరును
సంధింపంగ జేరన్న చం
దానం గావ్యములన్ నిజంబుగ గొనన్
గర్వించెనే కోవిదుం
దే నెవ్వాని కృతుల్ పఠించి కవినై
యిట్లుంటినో వానినా
శ్రీనాథున్ మది సన్నుతించెద గురు
శ్రీ నైభవం బేర్పడన్.

కావున వీరు కావించిన యాంధ్ర సారస్వత కృషినుండి యమృతకలశంబుగా నుద్భవించిన శ్రీ కృష్ణ భారతము విధవంబుగఁ బ్రభవంబై, విలాసంబునకు నివాసంబై, యానందంబునకు మూలకందంబై, గంగా నదీ ప్రవాహమువలె ధారాళంబై, నక్కవుల మనంబులంబోలి స్వచ్ఛంబై, కల్పతరువు భాతి ఫలవంతంబై, నవరసప్రధానంబై యొప్పుచున్నదని యామూలాగ్రముగఁ జదివిన రసజ్ఞులూహింపక మానరు. శతాధిక గ్రంథకర్తయై, యవధాన శిరోమణియై లోకానుభవమును గాంచిన వీమ్మట మహాభారతమును రచించిరి కనుక; యిందుఁ గల కవితాపాక మాహ్లాదకరంబై ద్రాక్షాపాకమై తనరారుచున్నది.

కవిసార్వభౌముని సొమ్ము

శైలి, తద్దయు మనోహరము, నన్నయాదుల భారతముండఁగ మఱల నీ భారత మేటికను వాదమునకు దొత్తిగఁ దావుండదని విదానముగఁ జూచువారికి స్ఫురింపకపోదు. పెద్ద విషయమంతయుఁ జిన్న పద్యమునందును, జిన్న విషయమును పెద్ద పద్యమునందును బొందుపఱుచు శక్తి యీ కవి సార్వభౌముని సొమ్ము. వీరు, యాశ్వాసాంత పద్యములయందుఁ బూర్వ కవుల వలెఁగాక, నూతన పక్కివిద్రొక్కి రచించిరి. ఈ పద్యములు భక్తి, జ్ఞాన, నీతి, వైరాగ్య బోధకంబులై మానవులకు ధర్మ మార్గదర్శకంబులై యున్నవని చెప్పుటలో నతిశయోక్తి లేదు. ఇంతటి యుద్గ్రంథము కవిగారు సజీవులై యుండఁగ బూర్తిగఁ బ్రకటింపఁబడుట—కవి గారి యదృష్టము గాక మఱేమి? మూలము ననుసరించి, తెనిగింపఁబడుటచే వ్యాసుని హృదయమును దెలిసికొనుట కవకాశ మేర్పడినది. కొన్ని రసవంతమగు ఘట్టములే కవిత్రయము వారు విడదిపెట్టిరి. 64,000 శ్లోకముల వ్యాసభారతము కవిత్రయమువారు 21,000 పద్యములలో వ్రాసి ముగించిరి. ఆ లోపము శ్రీ కృష్ణ భారతము దీర్చినదన్న ప్రఖ్యాతి కవిగ దీరఁజాలు. ఈ రెండవ భారత రచనమే కవిగారికి నాస్థాన కవి పదవిలభించుట గండపెండేర మందుకొను భాగ్యము కలుగుట, కనకాభిషేకము ఘటించుట లోక ఖ్యాతి నార్జించుట సంభవించినవి.

ఏకలేవి

శాస్త్రిగారు ధన్యజీవులు. నిండు మనంబు నవ్యనవనీత సమానమగు హృదయంబుఁ గాంచినవారు. ఇంతటి పవిత్ర జీవితము గడపినవారు నూటనాట నెక్కడనోగాని యుండరు. వేయేల రమారమి పదకొండు వందల యేబది మాసములు యాంధ్ర లోకమున, భారతవర్షమున జీవించిరి.

ఆదిమొదలు తుదివరకు నేకరీతిగా గడచిన ధన్యజీవి. కవి లేకున్నను భారతము నిలచినది. కావున—కవిత్రయ భారతమువలె నేఁటికి సంపూర్ణముగ లభించిన యీ శ్రీ కృష్ణ భారతము ఆచంద్రార్కము ప్రకాశించునట్లు—చేయు బాధ్యత, సాహిత్య లోకముపైనను, ప్రభుత్వ లోకముపైనను నిలచియున్నది.

తెలుగుప్రపంచమునకు పట్టుగొమ్మ

భారతమే సర్వస్వమని తలంచి పెక్కు చిక్కులకు లోనైనను, జలింపక, యభిమన్యుని వధ వ్రాయు సమయంబున, నేకైక పుత్రుఁడు సుదర్శనుండు భంగిపెట్టినను గ్రుంగక వారి సర్వస్వమును ధారవోసి, నేర్పుతో నోర్పుతో భారలకొలంది భారత సముద్రమును నీది, పారముఁజేరిన యోధుఁడీ కృష్ణుఁడు. వీరి కృతులన్నియు దేశాభివృద్ధికి మూలకందంబులు—అందు భారతము తెలుఁగు ప్రపంచమునకు "పట్టుఁగొమ్మ".

శా. ధారాశుద్ధికి జహ్నుకన్య పద
సందర్భ పుఁ బూదోఁట, భా
షాశామాహతి దర్పణంబు; కవితా
సామ్రాజ్య సింహాసనం
బేదా! సస్వరసామృతాంబు విధి,
శయ్యాపాక వ్యత్యాద్యం
కారాగారము కృష్ణభారత మనంగా
నెన్న సామాన్యమే!

అను విద్యావారిధి, నేఁటి ఆస్థానకవిబ్రహ్మ కాశీ కృష్ణాచార్యుల వారి యానందము, ఆశయము, వాక్కు సార్థకమై విరాజిల్లుగాక! [సంక్షిప్తము]




ఏరాడ

ప్రాచీన రేవు పట్టణాలలో ఏరాడ ఒకటి. ఏరాడను యీనాడు రేవు స్థలంగా ఎవరూ చెప్పటం లేదు. కాని, వందలాది యేండ్ల క్రిందట విశాఖపల్లె రేవే ఏరాడ రేవుగా కూడా వ్యవహారంలో వుండి వుంటుంది. ఒక వైపు ఏరాడ కొండ, రెండవ ప్రక్క విశాఖ జాలారి పల్లే మధ్యగా ఏర్పడిన దీ ఓడరేవు. ఆ చిన్న ఓడ రేవు నేడు ప్రసిద్ధిగన్న రేవు పట్టణంగా మార్పు చెందింది.

మన రేవు పట్టణముగురించి తెలుసుకొనే సందర్భంలో భారతీయ నౌకాయాన చరిత్ర తెలుసుకోవడం ధర్మం.

### నౌకా యానము

భారత దేశానికి సువిశాలమైన సముద్రతీరం వుంది. సుమారు నాలుగువేలమైళ్ళ సముద్రతీరంతో మనదేశం నౌకాయానానికి ఎంతో యోగ్యమైనదిగా వుంది. అందువలన చాలా పురాతన కాలంనుండీ భారతీయులు నౌకాయానం చేస్తున్నట్లు పెక్కు గ్రంథాలు చెబుతున్నాయి

ఆర్యులకాలపు ఋగ్వేదంలో, ఆదికావ్యమైన రామాయణంలో, పంచమ వేదమైన భారతమందూ బృహత్‌సంహితలలో, కాళిదాస కవి రఘువంశంలో, మాఘుని శిశుపాల వధ కావ్యంలో, సోమదేవుని కథాసరిత్సాగర గ్రంథములో, బౌద్ధ వాఙ్మయంలో, చాణక్యుని అర్థశాస్త్రంలో క్రీస్తు పూర్వం 5-వ శతాబ్దమునుండీ క్రీస్తుశకం 15-వ శతాబ్దంవరకూ అనగా సుమారు రెండువేలేండ్లు అంతకు ముందుగనే భారతీయులు నౌకాయానంలో ప్రజ్ఞ కలవారని గ్రహించగలం.

క్రీస్తునకు పూర్వం మూడు వేల సంవత్సరాల క్రితమే బాబిలోన్ పట్టణానికీ భారతదేశానికీ వర్తక వ్యాపారాలు జరుగుతూండేవని తెలుస్తుంది.

### విదేశ వర్తకం

నావికాయానంలో ఆంధ్రులు ఒక ప్రత్యేకత కలవారు. క్రీస్తుకు ముందు రెండువందల సంవత్సరాలకు ముందే ఆంధ్రరాజులు గ్రీసు, రోము, ఈజిప్టు, చీనా మున్నగు దేశాలతో వర్తకం చేసినట్లు చరిత్ర చెబుతున్నది.

### మ సూ నా

ఆంధ్ర దేశపు అతిప్రాచీన రేవు పట్టణాలలో కృష్ణాజిల్లాలోని గూడూరు (కొడ్డూరు) రేవు ముఖ్యకేంద్రమైవుండేది. యింకా మోటుపల్లి, కోరంగి, క్రొత్తపట్నం, కృష్ణాపట్నం, మచిలీపట్నం, కాకినాడ, కళింగపట్నం గోపాలపట్నం, పెంటకోట, పోలారం, వట్టాడ, పూడిమడక, కోనాడ, భీమునిపట్నం, విశాఖపట్నం మున్నగు రేవు లుండేవి.

కళింగాంధ్రులు వందలాది ఓడలలో బర్మా, సయాం, కాంబోడియా, మలయా, జావా, సుమత్రా, బలి మొదలైన దీవులకు వర్తకం నిమిత్తమూ, మత వ్యాప్తికీ వెళ్తూండేవారు.

జావాలో బారాబదూర్‌లోని విఖ్యాతిగన్న బౌద్ధ స్తూపం కళింగ దేశీయులైన రాజుల పాలనలో కట్టబడింది. కళింగ వర్తకులు బంగారం, వెండి, తగరం, అగరు, కర్పూరం, సుగంధ ద్రవ్యాలు దిగుమతి చేస్తూండే వారా ద్వీపాలనుండి.

ఈ విధంగా చరిత్ర సత్యాల బట్టి చూస్తే మౌర్యులు, ఆంధ్రులు, గుప్తులు, వర్ధనులు, కళింగులు, చోళులు, చాళుక్యులు మున్నగు రాజవంశాల కాలాన సముద్రయానం జరిగి, వర్తకం సాగేదని తెలుస్తుంది.

క్రమంగా విదేశీయుల తాకిడితో మన సముద్ర వర్తకము దెబ్బతిన్నది.

### విశాఖ నౌకాశ్రయం

ఒక కుగ్రామముగా వుండే "ఏరాడ—విశాఖ" ప్రాంతము నేడు అద్భుత నౌకాశ్రయంగా మారిపోయింది విశాఖ రేవు

పట్టణం అంతర్జాతీయ కేంద్రంగా మార్పు చెందింది.

ఏరాడ కొండ, డాల్ఫిన్స్ నోస్ కొండల మధ్యగా సముద్ర జలం తీరంలోనికి ప్రవేశించగా ఏర్పడ్డదే విశాఖ నౌకాశ్రయం సహజమైన రేవిది.

తూర్పు సముద్రతీరంలో కలకత్తాకూ మద్రాసుకూ మధ్యగా వుందీ రేవు. రేవు నలుదిక్కులా ప్రకృతి సౌందర్యం వర్ణనాతీతంగా వుంటుంది. ఒకవైపు ఏరాడ కొండ లోయలూ లోయల మధ్య మామిడి, కొబ్బరి తోటలూ. తరులతాచ్ఛాయల వల్ల దనాలున్నూ. ఇంకో ప్రక్క పెద్ద ఓడలు తయారు చేసే హిందూస్థాన్ షిప్ బిల్డింగ్ కంపెనీ, ఇంకోవైపు నావికా సైనిక శిబిరం, యింకా కొంత మీదుగా కాల్టెక్సు ఆయిల్ కంపెనీ, మరోవైపు రైలుమార్గాల యేర్పాట్లూ.

కుడివైపు ఒకేకొండ శిఖరాలపై కట్టబడిన మూడు మతాలకూ ప్రాతినిధ్యం వహించే హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ దేవాలయాలు. విశాఖ నగరమూ కనుల పండువ చేస్తాయి.

1933 అక్టోబరులో విశాఖ రేవును అభివృద్ధిచేసి పెద్ద నౌకల ప్రయాణానికి ప్రారంభోత్సవం చేశారు.

భారతదేశపు మూడు పెద్ద రేవు పట్టణాలలో విశాఖ రేవు ఒకటి. ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలనుండి వెలువడే ముడిసరుకుల ఎగుమతికీ, విదేశాల సరుకుల దిగుమతికీ విశాఖ ముఖ్యమైన రేవు పట్టణము

## రేవులో ఇసుక ఇబ్బంది

విశాఖ హార్బరులో నౌకల రాకపోకలకు ఒక పెద్ద యిబ్బంది వుండేది సముద్రంలోనుండి యిసుక అపరిమితంగా మేటలు వేసి రేవు లోతు తగ్గటంచేత నావల ప్రయాణానికి అటకం ఏర్పడుతూండేది. అందుకని తీర ముఖద్వారమందు కొన్ని స్టీమర్లను రాళ్లు నింపి ముంచివేసి యీ మేట వేయటాన్ని నివారించారు. ఆ ఆలోచన చెప్పింది మేధానిధి మోతుగుండం విశ్వేశ్వరయ్యగారే. ఈ ఏర్పాటు చేసినా ప్రతి సంవత్సరం కనీసం పది లక్షల టన్నుల యిసుక మేటలు రేవునుండి త్రవ్వి పారపోయాల్సి వస్తూంది. ఇందుకోసం ఆరు 'త్రవ్వోడలు' నిరంతరం పని చేస్తూంటాయి హార్బరులో

ఈ రేవులోనికి వెళ్ళే కాలువ సుమారు అరమైలు పొడవూ, నాలుగు వందల అడుగుల వెడల్పూ, నలభై అడుగుల లోతూ కలదిగా వుంది.

విశాఖరేవునుండి ఎగుమతి అయ్యే సరుకులలో ముఖ్యమైనవి మాంగనీసు, మైకాచేసే కాకిరాయి రిఫైన్డు ఆయిలు, యినుం రాయి మొదలైనవి. దిగుమతి చేసుకొనేవి ముడిచమురూ, గోధుమ, ఉక్కూ మున్నగునవి.

సరుకుల నిలువచేసే ఏర్పాట్లు నౌకల మరమ్మత్తుకు కావలసిన సామగ్రి, ఎగుమతి దిగుమతుల సదుపాయాలకు కావలసిన సాధన సంపత్తి అన్నీ వున్నాయి ఈ ఓడరేవులో. ఈ రేవు కేంద్ర ప్రభుత్వపు రైల్వేబోర్డువారి ఆజమాయిషీలో వుంది.

## దీప గృహం

రెండేళ్ళ క్రితమే విశాఖ హార్బరు ముందు ఏరాడ కొండపై గొప్ప దీపగృహం (లైట్ హౌస్) నిర్మించారు. సముద్రములో ప్రయాణంచేసే ఓడలకు కాంతిని ప్రసరిస్తున్న దీ దీపగృహం. తూర్పుదేశాలలో కల్లా యీ లైట్‌హౌస్ సాటిలేనిది. సుమారు 40 మైళ్ళవరకూ సముద్రములో వెలుగు ప్రసరించే నలభై లక్షల కాండిల్ పవరుకల్గిన విద్యుద్దీపం అమర్చబడిందిక్కడ.

విశాఖ రేవు అభివృద్ధికి యింకా మిక్కిలి శ్రద్ధ అవసరం ప్రభుత్వమూ శక్తివంచన లేక కృషి చేస్తూవుంది.

తృతీయ ప్రణాళికలో యీ రేవు అభివృద్ధికి 8½ కోట్ల రూపాయలు కేంద్ర ప్రభుత్వం కేటాయించింది.

ఇంత గొప్ప రేవు పట్టణము ఆంధ్రప్రదేశంలో ఉండడం మన అదృష్టం. తెలుగువారికి ప్రకృతి ప్రసాదించిన నిధులలో విశాఖ రేవు ఒకటి. [సంక్షిప్తం]



# ప్రసార విశేషాలు

## సుడిగాలి

[సీరియల్ నవల]

రచన: గుళ్ళపల్లి సుందరమ్మ

జానకి ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయినిగా పనిచేస్తూ, తన తల్లిదండ్రులను పోషిస్తూ ఉంటుంది. జానకి మేనత్త కొడుకును పెండ్లి చేసుకుంటే, తాము కూడా వారింటిలోనే సుఖంగా కాలక్షేపం చేయవచ్చు ననుకుంటారు, జానకి తల్లిదండ్రులు. కాని, జానకి దాని కిష్టపడదు. జానకికి తన సంపాదనతో జీవితం గడపడమే కష్టంగా తోస్తుంది.

పరిస్థితుల ప్రోద్బలంవల్ల ఆఖరికి జానకి, ఐదుగురు పిల్లలుగల ఒక రెండో పెండ్లివానిని వివాహమాడి, తన ఆర్థిక సమస్యను పరిష్కరించుకున్నానని తృప్తి పడుతుంది. తన మంచి నడతతో ఇంట్లో వారి అభిమానాన్ని పొందగలుగుతుంది.

కాని, ఇరుగుపొరుగువారి యిచ్చకపు మాటలకు భ్రమసి, భర్త తనకు అన్యాయం చేస్తున్నాడని అనుమానించి భర్తను సవతి పిల్లలను అనాదరంగా చూడడం మొదలు పెడుతుంది. దానితో వచ్చని సంసారంలో చిచ్చు రగుల్కొంటుంది. ప్రశాంత వాతావరణంలో సుడిగాలి చుట్టుతుంటుంది. అయితే, జానకి తన పరిస్థితులను సింహావలోకనం చేసుకుంటుంది. తన పొరపాటును గ్రహిస్తుంది. సకాలములో తన సంశయాలను సరిదిద్దుకోగలుగుతుంది. సుడిగాలి నిలిచిపోతుంది. సంసారం సాఫీగా నడచిపోతుంది.

### మద్రాస్ షార్ట్‌వేవ్ ప్రసారాలు

ఉదయం 49·30 మీ (6085 కిలోసై)

మధ్యాహ్నం 41·32 మీ (7260 కిలోసై)

సాయంత్రం 60·98 మీ (4920 కిలోసై)

పైన ప్రచురించిన షార్ట్‌వేవ్ మీటర్లలో ఉదయం 7-00 నుండి 7-15 వరకు, మ॥ 1-50 నుండి 2-00 వరకు, సాయంత్రం 7-00 నుండి 7-15 వరకు, రాత్రి 9-30 నుండి 10-30 వరకు మద్రాస్ (ఎ) కార్యక్రమాలు ప్రసారమౌతాయి.

సోమవారములు రాత్రి 9-15 గంటలనుండీ, బుధవారములు రాత్రి 7-45 నుండి 9-30 వరకూ పై మీటర్లలో మద్రాస్ (ఎ) కార్యక్రమాలను వినవచ్చును. తక్కిన సమయాలలో పై షార్ట్‌వేవ్ మీటర్లలో మద్రాస్ (బి) కార్యక్రమాలు ప్రసారమౌతాయి

మధ్యతరగతి కుటుంబ జీవితాన్ని చిత్రించే యీ నవలను, ఆరు భాగాలుగా మహిళామండలి కార్యక్రమంలో ఫిబ్రవరి ఒకటవ తేదీనుంచి ప్రతి గురువారం ఒంటి గంటకు వినవచ్చు.

* * *

కన్యాకుమారి, మధుర మీనాక్షి, కంచి కామాక్షి వంటి దక్షిణాది దేవాలయాలు భారత నారీమూర్తియొక్క వివిధ రూపాలను నిర్దేశిస్తాయని అంటారు. ఇవి సరస్వతి ఆదర్శంలో పరాకాష్ఠ నందుకుంటాయి. ఈ భావం ఆధారంగా, కన్యాకుమారి—అనే మొదటి రూపకం, ఫిబ్రవరి 7-వ తేదీ మధ్యాహ్నం ఒంటి గంటలకు ఆకాశవాణి హైదరాబాదు నుండి మహిళాసమాజ కార్యక్రమంలో ప్రసారమవుతుంది.

* * *

ఉత్తమ మహిళామణుల జీవితాలు మనకు ఉత్సాహాన్ని కలిగిస్తాయి. కాల ప్రభావంవల్ల వాళ్ళను మనం మరిచిపోకుండా, వారినిగురించి కొన్ని రూపకాలు ప్రసారం చెయ్యడానికి నిర్ణయమైంది. ఫిబ్రవరి 4వ తేదీ మధ్యాహ్నం ఒంటిగంటకు ఆకాశవాణి హైదరాబాద్ నుంచి రంగవల్లి కార్యక్రమములో, చాంద్‌బీబీ—అనే రూపకము ప్రసారమవుతుంది.

* * *

ఒక దేశంయొక్కగాని ఒక వ్యక్తి యొక్కగాని ఆర్థిక సౌష్ఠవం, ఆ దేశమూ ఆ వ్యక్తీ ప్రణాళికా బద్ధంగా నడవడాన్ని బట్టి వుంటుంది. సక్రమమైన సకాల ప్రణాళికల వల్ల దుబారాను రూపుమాపి అభ్యుదయం సాధించవచ్చు. పొదుపు ఉద్యమం—అనే తెనుగు రూపకం ఒక మామూలు వ్యక్తియొక్క కష్టసుఖాలను చెబుతుంది. ఫిబ్రవరి 4వ తేదీ సాయంత్రం 7-15 గంటలకు ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంనుంచి ఈ రూపకం వినవచ్చు.

## ఆపద మొక్కులు

(రూపకం)

రచన: జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి

పురిటింటిలో ప్రసవించిన స్త్రీకి వైద్యం జరుగుతుంది. వైద్యుడు లాభం లేదని చెప్పి వెడతాడు. ఆమెకు 'మృత్యువు' కనబడుతుంది. నేలనున్న మొక్కను బలవంతాన పీకి నప్పుడు, ఆ మొక్కకు కలిగే బాధవంటి బాధతో—దైవానికి మొక్కుకుంటుంది. లేక లేక కలిగిన పిల్లవాడి, అచ్చటా ముచ్చటా చూడనీయండని, మృత్యువు నవ్వి, సరేనని వెళుతుంది.

పిల్లవాడిని బళ్ళో వేశారు అక్షరాభ్యాస ఉత్సవం. బాలుడు బడికి వెళ్ళాడు. తిరిగి మృత్యువు వచ్చి పలకరిస్తుంది. ఆమె విచారంగా ఏడ్చి కొడుకు పెళ్ళి, కోడలి రాక చూడనియ్యమని బతిమాలుతుంది. మళ్ళీ మృత్యువు నవ్వి వెళ్ళిపోతుంది.

సంసారం చితికింది. జీవించడం కంటె మెరుగనిపించింది. కొడుకు తమకు ఇష్టురాలైన పిల్లను పెళ్లాడటానికి కూర్చున్నాడు. భర్త కొడుకు మీది కోపాన్ని ఆమెపై చూపించాడు. తనను తీసుకుపొమ్మని మృత్యువుని ఆమె ప్రార్థిస్తుంది. 'మృత్యువు' ఇప్పుడు కాదు అని చెప్పి వెళుతుంది.

కొడుక్కు బుద్ధి తిరిగి తలిదండ్రులకూ తనకూ ఇష్టమైన కన్యను పెళ్లాడుతాడు తల్లిదండ్రులు పోసుకుంటూంటారు నవదంపతులు. మృత్యువు వచ్చి రమ్మంటుంది. కొంతకాలం బ్రతక నివ్వమంటుంది. మృత్యువు ఈ ఆపద మొక్కును నిరాకరిస్తుంది.

ఆపద మొక్కులు—రూపకం ఫిబ్రవరి నెల 5-వ తేదీ సోమవారం రాత్రి 9-15 గంటలకు మద్రాసు కేంద్రంనుండి వినగలరు.

**గురువారం ఫిబ్రవరి 1**

## విజయవాడ

105.4 మీ (710 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* సుప్రభాతం
6-35 భక్తిరంజని
(విజయవాడనుండి రిలే)
6-55 కార్యక్రమ వివరణ
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత శిక్షణ
7-30 విజయవాడ వలె
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 సంగీత పరిచయ కార్యక్రమము
8-45* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-40 మాధ్యమిక పాఠశాలలకు
(విజయవాడనుండి రిలే)
12-10 మాధ్యమిక పాఠశాలలకు (ఉర్దూ)
12-30 కార్మికుల కార్యక్రమము
కార్మికులు, వివాద చట్టము
ప్రసంగం
ఎస్. రాఘవేంద్రరావు
విజ్ఞాన వీధి
సినీ గీతి †
1-00 స్త్రీలకు (ఉర్దూ)
1-30 రేడియో కళాశాల
(విజయవాడనుండి రిలే)
1-50 తెలుగులో వార్తలు
2-00 హైదరాబాద్ బి వలె
2-10 ఉర్దూలో వార్తలు
2-20 హైదరాబాద్ బి వలె
2-30* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 మరాఠీ శ్రోతలకు
7-00 తెలుగులో వార్తలు
7-15 ఆలం-ఎ-షేర్ బజార్ మేం
షేర్ : తలీక్ తజ్జాక
7-30 తూలికా చిత్రము-
జోళ్ళకు పాలిష్ వేసేవాడు
ప్రసంగం
దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి
7-45 రాగం, తానం, పల్లవి
(మద్రాస్ నుండి రిలే)
8-30 Radio News Reel
(relay from Delhi)
8-40 విరామ సంగీతం
8-45 ఎస్. వి. పాటన్‌కర్ : వయొలిన్
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 శ్రీ కృష్ణదాసుని
చైతన్య చరితామృత్
(మద్రాస్ నుండి రిలే)
10-00 ఎస్. వి. పాటన్‌కర్ : వయొలిన్
10-30* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

ఉ॥ ప్రసారము I

60 12 మీ (4990 కిలోసై)

6-30* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

49.02 మీ (6120 కిలోసై)

8-00 హైదరాబాద్ ఎ వలె
8-45 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42 02 మీ (7140 కిలోసై)

11-40 హైదరాబాద్ ఎ వలె
12 10 వయొలిన్ యుగళం :
పి. కుప్పుస్వామి
ఎస్. ఎల్. ఎన్. శాస్త్రి
12-30 హైదరాబాద్ ఎ వలె
1-00 సింగరాజు సుబ్రహ్మణ్యరాజు
1-30 హైదరాబాద్ ఎ వలె
2-00 సింగరాజు సుబ్రహ్మణ్యరాజు
2-30* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

60 12 మీ (4990 కిలోసై)

6-00* హైదరాబాద్ ఎ వలె
6-51 గ్రామస్థుల కార్యక్రమము
రామచంద్రుడు నాపై
రామదాస్ కీర్తన
విశ్వవిప్లవం తెచ్చిన పదార్థాలు :
వాక్సిన్ వలన రోగాలు
రాకుండునట్లు చేసికొనుట
ప్రసంగము
ఎన్. ఎల్. నరసింహారావు
పురాణం
వార్తావాహిని
ప్రకటనలు, ధరలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమము
విశేషాలేమిటి ?
చేయంగల విన్నపములు
7-30 హైదరాబాద్ ఎ వలె
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 లలిత్ సంగీత్
9-30 హైదరాబాద్ ఎ వలె
10-30* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## బెంగుళూరు

491 8 మీ (610 కిలోసై)

ఉ॥ ప్రసారము I

7-00* సుప్రభాత
కార్యక్రమ వివరణ మేళ గాన
7 15 టి. ఆర్. శ్రీనివాసన్
7-45 కన్నడమున వార్తలు
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీ శిక్షణ
8-30* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12 .00* కార్మికుల కార్యక్రమము
12-30 కె. జానకి అయ్యర్
హిందూస్థాని గాత్ర సంగీతం
1-00 హెచ్. ఎస్. అనసూయ
కన్నడగీతాలు
1-10 కన్నడమున వార్తలు
1-20 సుగమ్ సంగీత్
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 జలతరంగం :
నిలయవిద్వాంసుడు
2-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

ప్రసారము III

3-00* ఉన్నత పాఠశాలలకు
3-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

6-00* ఆంగ్లమున వార్తలు
ప్రాంతీయ వార్తలు
6-10 దేవర కె. రాఘు : దేవరనామ
6 20 కార్యవచన
6-35 ప్రదేశ సమాచార
6-45 గ్రామస్థులకు
7-45 కన్నడమున వార్తలు
8-00 కె. జానకి అయ్యర్ :
హిందూస్థానీ గాత్ర సంగీతం
8 [illegible] Reel
[illegible] from Delhi)
8-40 వాద్య సంగీత్ †
8-45 జానమంజరి
9 00 ఆంగ్లమున వార్తలు
9-15 The concept of
Justice;
Social Justis
talk by
N K. Dixit
9-25 వయొలిని †
9-30 అఖిలభారత కావ్య
కార్యక్రమము
చైతన్య చరితామృత
(కన్నడము)
10 00 ఎస్. బాలచందర్ : వీణ
10-30* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## తిరుచ్చి

319 1 మీ (940 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-45 *మంగళగానం
6-50 భక్తిగీతాలు
7-00 వాద్య సంగీతం
7-10 కార్యక్రమ వివరణ
7-15 తమిళమున వార్తలు
7-30 ఇశైక్కోవై !
పయనేరి ఎస్. నటరాజన్
7-55 స్థానిక ప్రకటనలు(ఆంగ్లము)
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికులకు
12-30 మాధ్యమిక పాఠశాలలకు
1-00 ఇశైక్కోవై !
ఎ. రామకృష్ణన్
1-30 వాద్య సంగీతం †
1-40 హిందీలో వార్తలు
1-50 గాత్ర సంగీతం †
2-00 తమిళమున వార్తలు
2-10 ఉన్నత పాఠశాలలకు
2.40 విరామ సంగీతం †
2-45 వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

1-45* వివిధ భారతి
5-45 సంగీత పాఠం
6-00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థులకు
7-15 తమిళమున వార్తలు
7-30 ఈమాసపు పాట
7-35 విజ్ఞాన విమర్శనం
పి. తంగరాజ్
7 45 రాగం, తానం, పల్లవి
(మద్రాస్ నుండి రిలే)
8-30 ఢిల్లీనుండి రిలే
8-40 చిత్రగానం †
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 సుబద్ధ సంగీతం
9.30 జాతీయ కావ్య కార్యక్రమము
(తమిళము)
(మద్రాస్ నుండి రిలే)
10-00 ప్రసార సమాప్తి

○○○○○○○○○○○○○○○○○○○○○

బుధవారం ఫిబ్రవరి 14

○○○○○○○○○○○○○○○○○○○○○

## హైదరాబాదు

ప్రసారము I

405·4 మీ (740 కిలోసై)

6-30* సుప్రభాతి
6-35 భక్తిరంజని
పెద్దింటి కొండదాసు గారి
నిర్గుణ వచనాలు
6-55 కార్యక్రమ వివరాలు
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత శిక్షణ
7-30 ఎస్. పద్మ, ఎస్. రాజకుమారి
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 హిందూస్థానీ సంగీత శిక్షణ
8-45 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-40 ఉన్నత పాఠశాలలకు
12-10 ఉన్నత పాఠశాలలకు (ఉర్దూ)
12-30 కార్మికుల కార్యక్రమము
(విజయవాడనుండి రిలే)
1-00 మహిళా సమాజం
స్త్రీల కార్యక్రమము
పెంపుడు జీవాలు ప్రసంగం
మీరుకోరిన పాటలు
మాటా మంతీ
మంగళం
1-30 విఠల్ రావ్ యెల్లప్ప జాధవ్
క్లారినెట్
1-50 తెలుగులో వార్తలు
2-00 హైదరాబాద్ బి వలె
2-10 ఉర్దూలో వార్తలు
2-20 హైదరాబాద్ బి వలె
2-30* వాతావరణ సూచన,
ప్రసార సమా.

సా॥ ప్రసారము III

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 కదంబకార్యక్రమము (ఉర్దూ)
7-00 తెలుగులో వార్తలు
7-15 ఆదాన్ ప్రదాన్
మహాభారత్ కే ప్రసంగ్
తిక్కన కీ రాజనీతి
ఉదాహరణాత్మక ప్రసంగము
(హిందీ)
జె. బి. భీమ్‌సేన్
7-30 శ్రోతలు కోరిన పాటలు †
8-00 సుడిగుండాలు నాటిక
(అంతర్విశ్వవిద్యాలయ రేడియో
నాటికల పోటీలో ప్రథమ
బహుమతి పొందిన నాటిక)
రచన: హరీంద్రబాబు
సమర్పణ: ఉస్మానియా
విశ్వవిద్యాలయ విద్యార్థులు
8-30 సంగీత రచనలు:
మహారాజ స్వాతి తిరునాళ్
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 Liberty and Democracy talk by Salvador de Madariaga (relay from Delhi)
9-45 సుగమ సంగీత్
9-55 విఠల్ రావ్ యెల్లప్ప జాధవ్
క్లారినెట్
10-15 బడేగులాం అలీఖాన్:
ఖయాల్ †
10-30* వాతావరణ సూచన,
ప్రసార సమా.

## హైదరాబాద్-బి

ఉ॥ ప్రసారము I

60·12 మీ (4990 కిలోసై)

6-30* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

49·02 మీ (6120 కిలోసై)

8-00 హైదరాబాద్ ఎ వలె
8-45 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42·02 మీ (7140 కిలోసై)

11-40 హైదరాబాద్ ఎ వలె
12-10 శాస్త్రీయ సంగీతం
12-30 హైదరాబాద్ ఎ వలె
2-00 ఎస్. పద్మ, ఎస్. రాజకుమారి
2-30* వాతావరణ సూచన,
ప్రసార సమా.

సా॥ ప్రసారము III

60·12 మీ (4990 కిలోసై)

6-00* హైదరాబాద్ ఎ వలె
6-15 గ్రామస్థుల కార్యక్రమము
కోలు కోలని పాట
పండ్లు నిల్వచేయుట ప్రసంగము
ఫిల్మ్ సంగీతం †
పల్లె ప్రాంతములు-
మంచినీటి పథకములు
ప్రకటనలు, ధరలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమము
విశేషాలేమిటి?
చేయంగల విన్నపాలు
7-30 హైదరాబాద్ ఎ వలె
9-15 రుక్మిణీ కల్యాణంనుండి
పాటలు
9-30 హైదరాబాద్ ఎ వలె
10-30* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## బెంగుళూరు

491·8 మీ (610 కిలోసై)

ఉ॥ ప్రసారము I

7-00* సుప్రభాత
కార్యక్రమ వివరాలు
మార్నింగ్ ట్యూన్స్
7-15 ఎమ్. శారద
7-45 కన్నడమున వార్తలు
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 జనవిహార-సంగీతపాఠం
8-30* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికుల కార్యక్రమం
12-30 పి. ఆర్. సుందరరాజన్
పి. వి. పొన్నయ్యపిళ్ళై:
మృదంగం
1-10 కన్నడమున వార్తలు
1-20 బి. జయమ్మ:
కన్నడ గీతాలు
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 వేదమ్మా సింగరాచారి
2-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

ప్రసారము III

3-00* ఉన్నత పాఠశాలలకు
3-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

6-00 ఆంగ్లమున వార్తలు
6-05 స్థానిక ప్రకటనలు
6-10 వేదమ్మా సింగరాచారి
6-35 ప్రదేశ సమాచార
6-45 గ్రామస్థులకు
7-45 కన్నడమున వార్తలు
8-00 సాహిత్య, సాంస్కృతిక
కార్యక్రమము (ఉర్దూ)
8-15 ఎ. వీరభద్రయ్య: వయొలిన్
వి. ఎ. రంగనాథన్:
మృదంగం
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 సమాచార దర్శన
9-25 శహనాయ్ †
9-30 Liberty and Democracy talk by Salvador de Madariaga (relay from Delhi)
9-45 టి. సుబ్బారావు పూతియ
వర్ణములు, కుంతలవరాళి,
సీతాలక్ష్మి వెంకటేశన్
10-00 ఆర్. కె. రామనాథన్:
శ్యామశాస్త్రి కృతులు
10-30* వాతావరణ సూచన,
ప్రసార సమా.

## తిరుచ్చి

319·1 మీ (940 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-45* మంగళగానం
6-50 భక్తి గీతాలు
7-00 వాద్య సంగీతం
7-10 కార్యక్రమ వివరాలు
7-15 తమిళమున వార్తలు
7-30 టి. పి. ఎ. ముత్తుకుమారస్వామి:
వీణ
7-55 స్థానిక ప్రకటనలు (ఆంగ్లము)
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికులకు
(మద్రాస్‌నుండి రిలే)
12-30 మాధ్యమిక పాఠశాలలకు
1-00 పెణ్ణులగం (స్త్రీలకు)
(తమిళము)
1-30 వాద్య సంగీతం †
1-40 హిందీలో వార్తలు
1-50 మెల్లిశై
2-00 తమిళమున వార్తలు
2-10 ఉన్నత పాఠశాలలకు
(తమిళం)
2-40 విరామ సంగీతం †
2-45 వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

4-45* వివిధ భారతి
5-45 సంగీత పాఠం
6-00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థులకు
7-15 తమిళమున వార్తలు
7-30 మద్రాస్ వలె
7-45 తహవ్వం
నాటిక (తమిళము)
రచన: పి. పొన్నుస్వామి
8-00 టి. పి. ఎ. ముత్తుకుమారస్వామి:
వీణ
8-30 చిత్రగానం †
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 నల్లురై
9-20 లయవిన్యాసం
9-30 ఢిల్లీనుండి రిలే
9-50 సంగీతమాల †
10-00 ప్రసార సమాప్తి

## ఆదివారం ఫిబ్రవరి 15

శక 1883 మాఘ 26

## మద్రాస్-ఎ

### ప్రసారము I

416.7 మీ (720 కిలోసై)

6-45 మంగళగానం
6-50 తుదిప్పాడల్‌గళ్
7-00 వాద్యగోష్ఠి
7-10 నేటి కార్యక్రమ వివరాలు, వాతావరణ సూచన (తమిళము)
7-15 తమిళములో వార్తలు
7 30* జానకీ స్వామినాథన్
8-00 మధురగీతం †
8-15 ప్రసార సమాప్తి

### ప్రసారము II

416.7 మీ (720 కిలోసై)

12-30 మాధ్యమిక పాఠశాలలకు
1-00 మహిళామండలి
స్త్రీల కార్యక్రమము
సుడిగాలి
సీరియల్ నవల (3వ భాగం)
రచన శుళ్ళపల్లి సుందరమ్మ
చర్చవేదిక
కళాశాల విద్యార్థినుల చర్చ
మంగళం
1-30 గానమంజరి †
1-40 హిందీలో వార్తలు
1-50 గీతమంజరి †
2-00 తమిళమున వార్తలు
2-10 ఉన్నత పాఠశాలలకు (తమిళము)
2-40 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

### సా॥ ప్రసారము III

416.7 మీ (720 కిలోసై)

5-30* ఎస్. నారాయణస్వామిపిళ్ళై: నాదస్వరం
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 గ్రామస్థులకు (తమిళము) (తిరుచ్చినుండి రిలే)
(7నుండి 7-15వరకుషార్టు వేవ్ పైగూడ)
7-00 శెయిదివిళక్కం వార్తావమీక్ష (తమిళము)
7-10 తిరుచ్చి వలె
7-15 తమిళములో వార్తలు
7-30* నాటక అనుభవంగళ్ ప్రసంగం (తమిళము) పి. సంబంధ మొదలియార్
7-40 ఇలమయిన్ కురల్ రూపకం (తమిళము) రచన: మాయావి
8-00 'పాడివళగువోం' పాట నేర్పుకుందాము
8-10 గీతమంజరి †
8-40 Radio News Reel (relay from Delhi)
8-40 వాద్య సంగీతం †
8-45 సంగీతమాల †
9.00 టి.ఎస్. కృష్ణన్: వయొలిన్‡
9-30 అఖిలభారత నాటక కార్యక్రమము
ఛాకే పావోఁ
హిందీ నాటిక
భగవతీచరణ్‌వర్మ
(తిరుచ్చినుండి రిలే)
10-30 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

211.3 మీ (1420 కిలోసై)
49.30 మీ (6085 కిలోసై)

### ఉ॥ ప్రసారము I

6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు**
7-15 సంగీత మంజరి †
7-30 మద్రాస్ ఎ వలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 ప్రసార సమాప్తి

### మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

12-00*కార్మికుల కార్యక్రమం (తమిళము) (తిరుచ్చినుండి రిలే)
12.30 మద్రాస్ ఎ వలె
1-00 కదంబం †
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 గీతమంజరి †
1-50 తెలుగులో వార్తలు**
2.00 మధురగీతం †
2 10 మద్రాస్ ఎ వలె
2.40 ప్రసార సమాప్తి

### సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోసై)
60.98 మీ (4920 కిలోసై)

5-30*పాశ్చాత్య సంగీతం †
5-50 స్థానిక ప్రకటనలు, వాణిజ్య వార్తలు(ఆంగ్లము)
6-00 ఆంగ్లమున వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-15 కార్యక్రమ వివరాలు (తమిళము)
6-20 ఎమ్. బాలసరస్వతి
7-00 తెలుగులో వార్తలు**
7-15 వీణ, క్లారినెట్: నిలయవిద్వాంసులు
7-45 రాగం, తానం, పల్లవి (తిరుచ్చినుండి రిలే)
8-30 శ్రోతలు కోరిన పాటలు †
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 Significance of Sex: Sex and Religion talk by Dr. S. T. Satyamurti
9-25 వాద్య సంగీతం†
9-30 అఖిలభారత నాటక కార్యక్రమము
ఛాకేపావోఁ
హిందీ నాటిక:
భగవతీచరణ్‌వర్మ
నిర్వహణ: శుభ
(తెలుగు)
10-30 ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 66వ పుటలో]

*షార్టు వేవ్ పైగూడ వినవచ్చును
**మీడియం వేవ్ పై మాత్రమే

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

### ప్రసారము I

6-30* శుభోదయం
6-35 భక్తిరంజని: అన్నమాచార్య కీర్తనలు డి. పశుపతి, ఎస్. ఆర్. జానకిరామన్
6-55 ప్రభాత తరంగిణి
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత శిక్షణ
7-30 కందుకూరి వీరాస్వామి: నాదస్వరం
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8.30 ప్రసార సమాప్తి

### మ॥ ప్రసారము II

11-00* రాష్ట్రగానము †
11.40 మాధ్యమిక పాఠశాలలకు
12-10 లలిత సంగీతం†
12-30 కార్మికుల కార్యక్రమం (హైదరాబాద్ నుండి రిలే)
1-00 కందుకూరి వీరాస్వామి: నాదస్వరం
1.30 విశ్వవిద్యాలయాలకు జాతీయ ఐక్యత చర్చ నిర్వహణ: ఎమ్. శివకామయ్య పాల్గొనువారు: ఆంధ్ర జాతీయ కళాశాల విద్యార్థులు, మచిలీపట్టణం బృందగానం
1-50 తెలుగులో వార్తలు
2-00 ప్రసార సమాప్తి

### సా॥ ప్రసారము III

6-00*స్థానిక ప్రకటనలు
6.05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థుల కార్యక్రమము
కుప్పించి ఎగసిన పద్యపఠనము
విశ్వవిప్లవం తెచ్చిన పదార్థాలు: పెన్సిలిన్ ప్రసంగం: డాక్టర్
పురాణం
వార్తావాహిని
ప్రకటనలు, ధరలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమము, విశేషాలేమిటి? చేయంగల విస్మయాలు
7-30 ప్రసంగము (హైదరాబాద్ నుండి రిలే)
7-45 రాగం, తానం, పల్లవి (మద్రాస్ నుండి రిలే)
8-40 Radio News Reel (relay from Delhi)
8-40 లలిత సంగీతం †
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 ఫిల్మ్ సంగీతం †
9-30 అఖిలభారత నాటక కార్యక్రమము (మద్రాస్ నుండి రిలే)
10 30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి


* సమయసూచన † గ్రామఫోన్ రికార్డు ‡ స్టూడియో రికార్డింగ్

○○○○○○○○○○○○○○○○○○○○○○

గురువారం: ఫిబ్రవరి 15

○○○○○○○○○○○○○○○○○○○○○○

## హైదరాబాదు-ఎ

405·4 మీ (740 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* సుప్రభాత్
6-35 భక్తిరంజని (విజయవాడనుండి రిలే)
6-55 కార్యక్రమ వివరణ
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత శిక్షణ
7-30 విజయవాడవలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 సంగీత పరిచయకార్యక్రమం
8-45* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-40 మాధ్యమిక పాఠశాలలకు (విజయవాడనుండి రిలే)
12-10 మాధ్యమిక పాఠశాలలకు (ఉర్దూ)
12-30 కార్మికుల కార్యక్రమము
ఐందరు కలంకారీ అద్దకాలు (ప్రసంగము)
విజ్ఞానవీధి
సినీగీతి†
1-00 స్త్రీలకు (ఉర్దూ)
1-30 రేడియో కళాశాల (విజయవాడనుండి రిలే)
1-50 తెలుగులో వార్తలు
2-00 హైదరాబాద్ బి వలె
2-10 ఉర్దూలో వార్తలు
2-20 హైదరాబాద్ బి వలె
2-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 మరాఠీ శ్రోతలకు
7-00 తెలుగులో వార్తలు
7-15 కలం-ఈ-షేర్
6-30 తూలికా చిత్రాలు: బస్ కండక్టర్ ప్రసంగం పోతంకి దక్షిణామూర్తి
7-45 రాగం, తానం, పల్లవి (మద్రాస్‌నుండి రిలే)
8-30 Radio News Reel
8-40 విరామ సంగీతం
8-45 డి. వి. పలూస్కర్: శాస్త్రీయ సంగీత్†
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 అఖిలభారత నాటక కార్యక్రమము (మద్రాస్‌నుండి రిలే)
10-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

ఉ॥ ప్రసారము I
60·12మీ (4990 కిలోసై)

6-30* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)
49·02 మీ (6120 కిలోసై)

8-00 హైదరాబాద్ ఎ వలె
8-45 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
42·02 మీ (7140 కిలోసై)

11.40 హైదరాబాద్ ఎ వలె
12-10 షేక్ హుస్సేన్ సాహెబ్: క్లారినెట్
12-30 హైదరాబాద్ ఎ వలె
1 00 ఎ. మృణాళిని
1-30 హైదరాబాద్ ఎ వలె
2-00 ఎ. మృణాళిని
2-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III
60·12 మీ (4990 కిలోసై)

6-00* హైదరాబాద్ ఎ వలె
6-15 గ్రామస్థుల కార్యక్రమము
కుప్పించి ఎగసిన పద్యాల సమ
విశ్వవిప్లవం తెచ్చిన పదార్థాలు: పెన్సిలిన్ ప్రసంగం డాక్టర్
పురాణము
వార్తావాహిని
ప్రకటనలు, ధరలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమము
విశేషాలేమిటి?
చేయంగల విన్నపాలు
7-30 హైదరాబాద్ ఎ వలె
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 లలిత్ సంగీత్
9-30 హైదరాబాద్ ఎ వలె
10-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## బెంగుళూరు

491.8 మీ (610 కిలోసై)

ఉ॥ ప్రసారము I

7-00* సుప్రభాత కార్యక్రమ వివరణ మేళగాన
7-15 నీలాదేవి: వీణ
7-45 కన్నడమున వార్తలు
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీ శిక్షణ
8-30* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికుల కార్యక్రమము
12-30 ఎ. జయమ్మ: హిందూస్థానీ గాత్ర సంగీతం బాలకిశోర్ రావ్ కొలేకర్: తబ్లా
1-00 సుగమ్ సంగీత్ †
1-10 కన్నడమున వార్తలు
1-20 హెచ్. ఉమాదేవి: కన్నడగీతాలు
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 జి. ప్రేమకుమారి: వచనగళు
2-[illegible]0* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

ప్రసారము III

3-00* ఉన్నత పాఠశాలలకు
3-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

6-00 ఆంగ్లమున వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-10 ఎమ్. ఎస్. తత్సం: దేవరనామగళు
6-20 కావ్యవచన: పఠనం: ఎమ్. సి. మహాదేవస్వామి
6-35 ప్రదేశ సమాచార
6-45 గ్రామస్థులకు
7-45 కన్నడమున వార్తలు
8-00 సిద్ధేశ్వరీదేవి: ఠుమ్రీ
8-30 Radio News Reel (relay from Delhi)
8-40 వాద్య సంగీత్ †
8-45 గానమంజరి †
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 The concept of Justice Poetic Justice talk by R. Y. Dharwadkar
9 25 క్లారినెట్ †
9-30 అఖిలభారత నాటక కార్యక్రమము ఛాకేపాపోట్ (కన్నడము)
10-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## తిరుచ్చి

319 1 మీ (940 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-45* మంగళగానం
6-50 భక్తిగీతాలు
7-00 వాద్య సంగీతము
7-10 కార్యక్రమ వివరణ
7-15 తమిళమున వార్తలు
7-30 ఎస్. నాగలక్ష్మి
7-55 స్థానిక ప్రకటనలు (ఆంగ్లము)
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికులకు
12-30 మాధ్యమిక పాఠశాలలకు
1 00 ఎస్. నాగలక్ష్మి
1-30 వాద్య సంగీతం †
1-40 హిందీలో వార్తలు
1-50 గాత్ర సంగీతం †
2-00 తమిళమున వార్తలు
2-10 ఉన్నత పాఠశాలలకు
2-40 విరామ సంగీతం †
2-45 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

4-45* వివిధ భారతి
5-45 సంగీత పాఠం
6-00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థులకు
7-15 తమిళమున వార్తలు
7-30 'ఉమాసపుపాటు'
7-35 ఎన్నాపియప్పు: నంపు సెయలాలర్ ప్రసంగం (తమిళము) ఎ.వి.ఆర్. కృష్ణస్వామి రెడ్డియార్
7-45 రాగం, తానం పల్లవి: టి. ఎస్. మణియానందం
8-30 ఢిల్లీనుండి రిలే
8-40 చిత్రగానం †
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 రేడియో నాటక సంగీతం
9-30 అఖిలభారత నాటక కార్యక్రమము ఛాకేపాపోట్ (తమిళము)
10-30 ప్రసార సమాప్తి

---

* సమయ సూచన   † గ్రామఫోన్ రికార్డు   ‡ స్టూడియో రికార్డింగ్

# Postal Notice

—o—

All the Broadcast Receiver Licences issued for possessing and working of broadcast receivers expire on the 31st December. The Broadcast Receiver Licences expiring on 31st of December, 1961 can be renewed up to 31st January, 1962, without the payment of any penalty, after which a penalty at the rate of Re. 1/- per month will be charged. However, to avoid eleventh hour rush at the post offices during the last days of January and for the convenience of the licence holders themselves, all the Head and Sub-Post Offices will start renewing the Broadcast Receiver Licence from 1st November 1961. As such to avoid the rush on closing days, all the Broadcast Receiver Licence-holders are advised to renew their licences as early as possible on the payment of annual licence fee and producing the old Broadcast Receiver Licence. In case the old Broadcast Receiver Licence has been lost or misplaced, the licensee should apply to the original Post Office which issued the lost licence, for the issue of a Substitute Licence along with the payment of Rs. 2/- in cash. The Substitute Licence will be issued on the spot after verifying the records of the post office. This Licence then should be renewed on the payment of the renewal fee. If the application for the Substitute Licence cannot be made to the Original Post Office, the Licensee should apply to any Head or Sub-Post Office according to his convenience along with the payment of Rs. 2/- as substitute Licence fee in addition to the due renewal fee for the Year 1962 in cash, for which a temporary receipt in form ACG—67 will be given to them. After the verification of the particulars of the lost licence from the original post office, the substitute licence will be issued and kept in post office as records in place of the lost licence and the renewal licence will be handed over to the licensee.

It is also for the information of all concerned that the Commercial Broadcast Receiver Licences which were previously being issued and renewed by the Heads of Circles will now be issued and renewed by the Head and Sub-Post Offices. The holders of Commercial Broadcast Receiver Licences should not wait for demand notices from the Circle Offices and should apply for the renewal of their licences to any Head or Sub-Post Office convenient to them along with the due licence fee in cash and producing the old licences.

In this connection it is stated that the possession and working of a radio set without a valid licence is an offence punishable under the Indian Telegraph Act, 1885 and the Indian Wireless Telegraphy Act, 1933. Under the Indian Wireless Telegraphy Act, 1933, a licence is required for the mere possession of a radio set even though it may be temporarily out of order and irrespective of the fact whether it is used or not. As such the Licence holders intending to work or possess radio sets during the next year should renew their licences as early as possible. The renewal season will start from 1st November, 1961.

# ప్రసంగములు

**మద్రాస్**

ఫిబ్రవరి 7 బు॥ రా॥ 7-45 కళాపూర్ణోదయ ప్రారంభము.**
పి. గణపతిశాస్త్రి

,, 14 బు॥ రా॥ 7-45 స్వీయకవిత **
సిదవటం వెంకటరావు

**విజయవాడ**

ఫిబ్రవరి 5 సో॥ రా॥ 9-45 సమకాలీన ఆంధ్ర సాతన్వత
ముపై సాంకేతిక శాస్త్ర విజ్ఞాన ప్రభావం
కొండముది శ్రీరామచంద్రమూర్తి

,, 13 మం॥ సా॥ 6-15 సరోజినీ నాయుడు
శత జయంతి
ఎ. నరసింహశాస్త్రి 'అమరేంద్ర'

**హైదరాబాద్**

ఫిబ్రవరి 1 గు॥ రా॥ 7-30 తూలికా చిత్రాలు:
జోళ్ళకు నాడా వేసేవాడు
దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి

,, 6 మం॥ సా॥ 6-15 నేను కథ ఎలా వ్రాసాను?
గోష్ఠి
పాల్గొనువారు: టి. గోపీచంద్
పి. పద్మరాజు
కె. కుటుంబరావు

,, ,, ,, సా॥ 6-30 స్వీయకవిత:
అరిపిరాల విశ్వం

,, 8 గు॥ రా॥ 7-30 చూసేకలగా కాదు!
అడుగడుగునా సేవలు అవకాశాలు
ఆపుల కాలబశివరావు

,, 11 ఆ॥ సా॥ 6-15 స్వీయకవిత:
ఎమ్. ఆర్. బలరామాచార్య

,, 12 సో॥ మ॥ 1-30 జాతీయ ఐక్యము:
చరిత చెప్పిన పదము
డా॥ పి. శ్రీనివాసాచార్

,, ,, ,, రా॥ 9-45 నవల: సాంఘిక విమర్శ:
ఎ. రమాపతిరావు

,, 13 మం॥ సా॥ 6-30 స్వీయకవిత.
ఎ. ముదలివర్

,, 15 గు॥ రా॥ 7-30 తూలికా చిత్రం:
బస్ కండక్టర్
పోతుకూచి దక్షిణామూర్తి

# నాటికలు రూపకములు

**మద్రాస్**

ఫిబ్రవరి 5 సో॥ రా॥ 9-15 అపద మొక్కులు**
రచన: బలమూరు రంగనాథశాస్త్రి
నిర్వహణ: ఏ. ఫ్లెక్

,, 11 ఆ॥ మ॥ 3-00 'సోమా'

,, 12 సో॥ రా॥ 9-15 అంతిమ కోరిక**
ఏకపాత్రాభినయం
రచన: ఎ. విశ్వేశ్వరరావు
నిర్వహణ: బృందావన చౌదరి

**విజయవాడ**

ఫిబ్రవరి 2 శు॥ రా॥ 9-30 గాజోపమైనా బ్రతకండి
రచన: బెల్లంకొండ రామదాసు

,, 3 శ॥ రా॥ 7-30 మన పురావస్తుస్థానములు:
గుంటుపల్లి
రూపకము
రచన: రాళ్ళబండి సుబ్బారావు

,, 4 ఆ॥ మ॥ 3-00 ద్రౌపది నాటిక
రచన: చిటుకూరు సత్యనారాయణరావు

,, 7 బు॥ రా॥ 8-00 నన్ను విడుదల చేయకండి
రచన: కన్నెగంటి పార్వతీదేవి

,, 10 శ॥ రా॥ 9-15 పద్మగంధ
రచన: నండూరి సుబ్బారావు

**హైదరాబాద్**

ఫిబ్రవరి 3 శ॥ రా॥ 9-15 రక్త సంబంధాలు
నాటిక

,, 4 ఆ॥ సా॥ 6-15 హిమాలయ వియోగిని
సంగీత రూపకము
రచన: వి. దుర్గానంద్

,, 9 శు॥ రా॥ 9-30 ముఖస్తుతి
రచన: టి. కృష్ణమోహనరావు

,, 13 మం॥ రా॥ 9-30 నాటి హైదరాబాద్
సంగీత రూపకము
(సరోజినీనాయుడు పద్యముల
నాధారంగా గొని)
రచన: దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి

,, 14 బు॥ రా॥ 8-00 సుడిగుండాలు నాటిక
(అంతర విశ్వవిద్యాలయ రేడియో నాటికల
పోటీలలో ప్రథమ బహుమతినందినది)
రచన: హరీంద్రబాబు
సమర్పణ: ఉస్మానియా విశ్వవిద్యాలయ
విద్యార్థులు

# సంగీత కచేరీలు

**మద్రాసు**

జనవరి 1 గు॥ రా॥ 7-45 రాగం, తానం, పల్లవి
ఎమ్. ఎమ్. దండపాణి దేశికర్
తిరుచ్చి బాలసుబ్బరాయుడు, వయొలిన్
మద్రాస్ ఎ. కణ్ణన్: మృదంగం

,, 2 శు॥ రా॥ 7-30 ఎమ్. ఎల్. వసంతకుమారి
తిరువళ్ళూర్ సుబ్రహ్మణ్యం: వయొలిన్
తంజావూర్ ఎస్. కృష్ణమూర్తిరావు: మృదంగం
టి. ఎస్. విల్వాద్రి అయ్యర్: ఘటం

,, 4 ఆ॥ ఉ॥ 8-15 జి. వైదేహి

,, 5 సో॥ రా॥ 9-30 బూవలూరి కృష్ణమూర్తిశాస్త్రి
గోటువాద్యం
బి. కె. లక్ష్మి: వీణ
ముత్యాల నాయుడు: మృదంగం

,, 8 గు॥ రా॥ 7-45 రాగం, తానం, పల్లవి
ఎస్. నరసింహులు
వి. గోవిందస్వామి నాయకర్: వయొలిన్
కోయంబత్తూర్ ఎస్. రామస్వామి: మృదంగం

,, 9 శు॥ రా॥ 7-30 జి. ఎస్. బాలసుబ్రహ్మణ్యం

,, 11 ఆ॥ ఉ॥ 8-15 బి.వి.రామన్, బి.వి.లక్ష్మణన్

,, 12 సో॥ రా॥ 9-30 సి. వి. ధనలక్ష్మి: వయొలిన్
తంజావూర్ నారాయణస్వామిపిళ్ళె: మృదంగం

,, 13 మం॥ రా॥ 7-45 ఎస్. బాలచందర్: వీణ
ఉమయాళ్పురం కె. శివరామన్: మృదంగం

**విజయవాడ**

ఫిబ్రవరి 1 గు॥ ఉ॥ 7-30, మ॥ 1-00 టి. ఆర్. గంగాధరన్: నాదస్వరం

,, 3 శ॥ ఉ॥ 7-30, రా॥ 8-00 చల్లపల్లి కృష్ణమూర్తిశాస్త్రి: వయొలిన్

,, 4 ఆ॥ రా॥ 8-00 సాత్తూర్ ఎ.జి.సుబ్రహ్మణ్యం

,, 6 మం॥ ఉ॥ 7-30, రా॥ 8-00 ఎస్.సూర్యనారాయణమూర్తి క్లారినెట్

,, 7 బు॥ రా॥ 9-50 మదుర మణి అయ్యర్

,, 8 గు॥ ఉ॥ 7-30 వెలిది సుబ్బారావు: వేణువు

,, 10 శ॥ ఉ॥ 7-30 వి. విజయలక్ష్మి

,, ,, ,, రా॥ 8-00 ఎస్.సి.వి జగన్నాథాచార్యులు

,, 11 ఆ॥ రా॥ 8-00 ఎమ్. చంద్రశేఖరన్: వయొలిన్
డి. రామమోహనరావు: మృదంగం

,, 13 మం॥ ఉ॥ 7-30, రా॥ 8-00 శేషు నర్వశాస్త్రి: వయొలిన్

,, 15 గు॥ ఉ॥ 7-30, మ॥ 1-00 కందుకూరి వీరాస్వామి: నాదస్వరం

**హైదరాబాదు**

ఫిబ్రవరి 2 శు॥ ఉ॥ 7-30, మ॥ 1-00 కొనపిడు షేక్ హుస్సేన్ సాహెబ్. నాదస్వరం

,, 4 ఆ॥ ఉ॥ 7-45, రా॥ 8-30 గోవిందరావ్ దంతాలే, ఎస్. నరహరి: తబ్లా

,, ,, ఉ॥ 8-30 పి. సోమేశ్వరరావు: వీణ
రా॥ 7-30 పి. సుబ్బారావు: మృదంగం

,, 7 బు॥ ఉ॥ 7-30, మ॥ 2-00 టి. జి. పద్మనాభన్

,, 11 ఆ॥ రా॥ 8-30, రా॥ 9-45 శ్యామలాదేవి: ఖయాల్

,, 12 సో॥ రా॥ 7-30 ఎస్. సి. సత్యనారాయణ

,, 13 మం॥ మ॥ 2-00 వి. బి. నీలాంబ యి: వీణ

,, 15 గు॥ మ॥ 1-00, ,, 2-00 ఎ. మృణాళిని

**బెంగుళూరు**

ఫిబ్రవరి 4 ఆ॥ ఉ॥ 8-30 ఎమ్. వి. వరాహస్వామి: గోటువాద్యం

,, ,, ,, రా॥ 8-15 టి. రుక్మిణి

,, ,, రా॥ 10-15 చిత్తూరి సుబ్రహ్మణ్యపిళ్ళె

,, 6 మం॥ రా॥ 9-30 అంజికుడి సుబ్బయ్య సోదరులు. నాదస్వరం

,, 7 బు॥ రా॥ 8-15 ఎస్ పి నటరాజన్: వేణువు

,, 10 శ॥ రా॥ 8 00 ఆర్. కె. శ్రీకంఠన్

,, 11 ఆ॥ రా॥ 8.15 ఎమ్. శంకరనారాయణశాస్త్రి: వీణ
కె. ఎస్. గోపాలరావు: మృదంగం

,, 12 సో॥ రా॥ 8-15 టి. పుట్టస్వామయ్య రాగం, తానం, పల్లవి

,, 13 మం॥ రా॥ 9-40 బసవరాజ్ రాజగురు: హిందూస్థాని సంగీతము

,, 14 బు॥ రా॥ 8 15 ఎ. వీరభద్రయ్య: వయొలిన్

,, 15 గు॥ రా॥ 8-00 సిద్ధేశ్వరిదేవి: ఠుమ్రి

**తిరుచ్చి**

ఫిబ్రవరి 2 శు॥ ఉ॥ 7-30 ధర్మపురం ఎస్. అభిరామ సుందరంపిళ్ళె: నాదస్వరం

,, 6 మం॥ ఉ॥ 7.30 వి. ఎ. మీనాక్షి
రా॥ 7-45 పి వడివేలు మొదలియార్

,, 7 బు॥ ఉ॥ 7 30, రా॥ 8-00 హెచ్. ఎస్. మధ్వాచార్: గోటువాద్యం

,, 10 శ॥ ఉ॥ 7-30, మ॥ 2 10 ఈశాపూర్ ఎస్. శ్రీనివాసన్: వయొలిన్

,, 11 ఆ॥ మ॥ 3-00 చిదంబరం కె. గోవిందమ్మాళ్

,, ,, రా॥ 7-30 పాపుగుడి పి.వి.గణేశయ్యర్, కె. రామయ్య

,, 15 గు॥ ఉ॥ 7-30, మ॥ 1-00 ఎస్. నాగలక్ష్మి

# పశ్చాత్తాపము

(శ్రవ్యనాటిక)

ఆర్. కె. జయలక్ష్మి,

వేణు: (ప్రవేశము)—శాంతా, శాంతా

శాంత: ఇస్. అరవకండి. బాబిప్పుడే పడుకొన్నాడు. మధ్యాహ్నంనుండి ఒకటే గొడవ. పడ్చేడ్చి ఇప్పుడే నిద్దరపొయ్యాడు. ఏమిటా తొందర?

వేణు: ఏముంది, మీ అన్నయ్య చంద్రం ఉత్తరం రాశాడు

శాంత. వ్రాశాడూ, అనుకుంటూనే వున్నా, ఇవ్వాళో రేపో వుత్తరం వస్తుందని. ఏమిరాశాడేమిటి? ఎప్పుడొస్తాడట?

వేణు: ఇదుగో. వుత్తరం చదువుతున్నా విను.

"మహారాజశ్రీ వేణు బావగార్కి నమస్కరించి వ్రాయునది. మొన్న మీరు వ్రాసినవుత్తరం అందినది. ఎప్పుడో ఒకసారి తిరుపతికి వస్తానని మీతో అన్నాను. కాని ఇప్పుడు తిరుపతి వెళ్ళాలనిలేదు. కారణం మీకు తెలియందేమీకాదు. పోయనసారి కోడిపుంజు తిరునాళ్ళలో ఎంతో మోజుపడికొన్న ఎల్లగిత్త పందాలలో ఓడిపోయింది. పోనీలే అని వూరుకున్నాను. ఒంగోలు ఆవుకు మాంచి కోడెదూడ పుడితే తిరుపతి వస్తానని మ్రొక్కుకున్నాను, నాలుగురోజులకాడు ఆవు ఈనింది. పెయ్యదూడని పెట్టింది. నా ఆశలు నిరాశలైపోగా, దేవునిపై ఒక విధమైన ఏహ్యభావ మేర్పడ్డది. నేనింక ఏ దేవునికీ మొక్కదలచ లేదు. మీతోపాటు తిరుపతికి రానందుకు చెల్లెలు, చి.సౌ. శాంతకూ, చిరంజీవి వెంకటాచలానికి నా దీవెనలు తెలిపేది.

ఇట్లు, చంద్రం.

శాంత: పీడి వల్లవనం బంగారంగాను. ఇదేవిటండీ. ఆవుకు పెయ్యదూడ పుడితే వచ్చేనష్టమేమిటో? కట్నాలూ కానుకలూ ఇచ్చి. చీరా సారే పెట్టి పెండ్లిచెయ్యాల్సిన బాధేమీ లేదుగా. దేనికో ఇంత నిరాశ?

వేణు: నాకేం తెలుసు....మీ అన్న వచ్చినప్పుడు అడుగు—చెపుతాడు.

శాంత: పోనీలెండి. అబ్బాయికి ఏడాది వెళ్ళకముందే కొండకొస్తామని మ్రొక్కుకున్నామాయె—ఎలాగో ఈ నెలలోపల తిరుపతి వెళ్ళి మ్రొక్కు తీర్చుకురావాలి. వాడికి తప్పిందని మనకెలా తప్పుతుంది చెప్పండి.

వేణు: మనకుమటుకిప్పుడేం తొందర? చేతిలో దమ్మిడీ లేదాయె. ఏదో ఆపదలో మ్రొక్కుకున్నాం....ఆపద మ్రొక్కులు అరవైయేండన్నారు.

శాంత: ఏమో, అదేమీ కుదరదండి. బాబు శ్రేయస్సుకోరైనా మీరీ మ్రొక్కు సంవత్సరం వెళ్ళకముందే తీర్చాలి. ఈ నెలదాటితే మంచిరోజులు లేవని బామ్మగారు పంచాంగంచూసి చెప్పారు. మీరెలాగైనా....

వేణు అదే ఆలోచిస్తున్నా. కొండ కెళ్ళటమంటే సామాన్యమా? చేతుల్లో డబ్బుండొద్దూ?

శాంత: అలాగని గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటే ఎలాగండీ? అప్పో సొప్పో చేసి మ్రొక్కుబడి తీర్చుకోవాలిగాని—

వేణు నిజమే కాని. ఎంతాలోచించినా డబ్బు దొరికేమార్గం కనిపించటం లేదు.

శాంత: పోనీలెండి, మీ స్నేహితుల నెవరినైనా అడిగి చేబదులు తీసుకురండి. తరువాత తీర్చేద్దాం.

వేణు: రూపాయికి శేరుంబావు బియ్యంకాని యీ రోజుల్లో ఏవుద్యోగస్తునికి డబ్బు మిగులుతుంది? అడిగి లేదనిపించుకోవటం తప్పు!

వేణు సరే. అలా వెళ్ళివస్తాను.

శాంత: పెందలాడే తిరిగిరండి....

—విరామం—

బామ్మ: పసిపిల్ల తల్లివి. నీవన్నా పెందరాడే కాస్త ఎంగిలి పడకూడదూ?

శాంత. ఏమో బామ్మగారూ, వారురాందే నాకు తినబుద్ధిపడు. ఇవ్వాళ అసలు నామనసేమీ బాగుండలేదు. నాలుగైదు రోజుల్లో తిరుపతి వెళ్ళాలనుకొన్నామాయె. చేతిలో దమ్మిడీలేదు. మా నాన్నగారి నడిగి అప్పుగానైనా తీసికొందామంటే మావారికది మొట్టమొదటి నుండీ గిట్టని విషయం, పోనీ స్నేహితులనెవరినైనా అడిగి చేబదులు తెమ్మన్నాను. అయిదున్నర కెళ్ళినవారు, పదైనా ఇంకా రాలేదు. ఎక్కడెక్కడ తిరుగుతున్నారో ఏమో? డబ్బు దొరికిందో లేదో, అదే బెంగగావుంది.

బామ్మ: ఆ సందేహమే వుండకూడదు తల్లీ. అలా అనుమానించినప్పుడు నిజంగానే డబ్బు దొరక్కపోయినా దొరక్కపోవచ్చు కాని పూర్తిగా భారం వానిపై వేసి వానినే నమ్ముకొన్నవారికి భగవంతుడేనాడూ సహాయపడకమానడు. అన్నిటికీ ఆయన్నేనమ్మి ధ్యానం చెయ్యండి. డబ్బు దానంతటదే నడిచివస్తుంది. అదుగో అబ్బాయ్ వస్తున్నట్లున్నాడు పెందరాడే భోంచేసి పండుకోవమ్మా. వస్తా....

శాంత: మంచిది బామ్మగారూ.

వేణు: [ప్రవేశం]—ఆలస్యమైందీ. ఒక్కదానివీ దిక్కు దిక్కుమంటూ వుంటావనుకొన్నాను.

కాంత: ఇంతకీ మీరు వెళ్ళిన పనేమయింది? డబ్బేమన్నా దొరికిందా?

వేణు: ఎవరు పోగొట్టుకున్నారు గనుక మనకు దొరకటానికి?

కాంత: నేను గట్టిగా అడుగుతుంటే ఏమిటండీ ఆ ఎగతాళి?

వేణు: అయితే నేనూ గట్టిగానే చెబుతాను. విను. మొట్టమొదట సుదర్శనం కనిపించాడు. నేను అడుగుదామనుకుంటుండగానే, వాడే నోరు తెరిచి జీతాలొచ్చాక ఇస్తాను. ఓ పది రూపాయలుంటే సర్దమన్నాడు. వాడికో నమస్కారంపెట్టి బ్రహ్మానందాన్ని వెతుక్కుంటూ బయలుదేరాను.

కాంత: కనిపించాడా మరి?

వేణు: వినూ మరి. వాణ్ణిపట్టుకోడానికి కాళ్ళు పడిపోయేలా తిరిగాను. చివరకి పార్కుదగ్గిర వాడి దర్శనమైంది. ఒక్క అణా వుంటే యివ్వరా, వేరుశెనక్కాయలయినా కొనుక్కుతిందాం అన్నాడు.

కాంత: అంటే అణాకూడా లేదన్నమాట అతని దగ్గర.

వేణు: ఉంటే నన్నెందుకడుగుతాడే పిచ్చిదానా. వాడికా నైవేద్యం చెల్లించి. ఉన్నసంగతి చెప్పాను. సరే ప్రయత్నిద్దాం పదమని ఈశ్వరరెడ్డి దగ్గరికి తీసుకెళ్ళాడు.

కాంత: మరి ఆయనేమన్నాడు?

వేణు: చెప్పనీ నన్ను. మేము వెళ్ళేటప్పటికి వాడియింట్లో ఒక పెద్దసీను జరుగుతోంది.

కాంత: ఏమిటది?

వేణు: ఇంటి యజమాని మనవాణ్ణి పట్టుకుని అద్దెకడతావా లేక పెట్టేబేడా బైట పడేయమంటావా అని యుద్ధం చేస్తున్నాడు. వాళ్ళిద్దరికీ, రాజీ కుదిరి నెల్నాళ్ళకి తలప్రాణం తోకకొచ్చింది. ఇదీ సంగతి. ఇంక నాకు తిరిగే ఓపికా డబ్బు దొరుకుతుందన్న ఆశలేదు. అసలు నే వెళ్ళేవాడినే కాదు. కాని.... నువ్వేమో—

కాంత: అదే మనలోవున్న బలహీనత. నేనేదో అన్నానని—లేక—అనుకొంటానని మీరు ప్రయత్నించారే కాని—మీరు మనస్ఫూర్తిగా ప్రయత్నించలేదు. అందుకే అదికూడా దొరక్కుండా పోయింది. మీరు నిజంగా భగవంతునిమీద భారంవేసి ప్రయత్నిస్తే మీకు తప్పక దొరికివుండేది. మీరు వచ్చేవరకూ బామ్మగారు చెపుతూన్న మాటలు వింటే మనం సిగ్గుపడతాము. ఆమెకు భగవంతుడంటే ఎంతో భక్తి, ఎంతో నమ్మకం!

వేణు: ఆమెతో మనకేమిసాటి? ఆమెలోని ఏకాగ్రత, నిశ్చలభక్తి మనకు రావాలంటే యీ జన్మలో సాధ్యపడదు.

కాంత: అది నిజమేకావచ్చు. అలా అని మీరు దైవారాధన మానగలరా? లోకంతీరే అంత. ఎవరిభక్తి వారిది. అందులో ఆత్మవంచన జరుగకూడదు. మీరు వెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కొని భగవంతుని నిశ్చలంగా దణ్ణం పెట్టుకోండి. అంతా నీదేభారం, నా శక్తివంచన లేకుండా నే ప్రయత్నం చేశాను. ఈపైన నీదయ కావాలి అని మ్రొక్కుకోండి. ఇంకా రెండురోజుల వ్యవధివుంది. వాడే ఆదుకొంటాడు.

వేణు: అయితే దీపారాధనచెయ్యి—మానెపోవి. ఇంతలో కాళ్ళు కడుక్కొనివస్తా.

(ఇంటర్‌ల్యూడ్)

వేణు: (ప్రవేశము)—కాంతా, కాంతా ఏం చేస్తున్నావ్?

కాంత: వస్తున్నా. ఏమిటండి, అంత పెందలాడే వచ్చారు ఆఫీసునుంచి.

వేణు: పదిరోజులు సెలవుపెట్టి వచ్చాను.

కాంత: సెలవుపెట్టారా, అంటే, డబ్బు దొరికిందన్నమాట!

వేణు: తప్పుతప్పు, డబ్బు దొరకలేదు వాడే పంపించాడు.

కాంత: నే చెబితే విన్నారూ, నమ్మినవాళ్ళ కామాత్రం యివ్వడా ఏమిటి? ఇంతకీ పైకం ఎక్కడిదండీ?

వేణు: మన మీవూరు ట్రాన్స్‌ఫర్ అయి వచ్చిన క్రొత్తలో ఒక సంవత్సరము పైచిలుకు హౌస్‌రెంట్ ఎలవెన్సు ఇవ్వలేదుగా. అది ఇప్పుడొచ్చింది. చాల చిత్రంగావుందికదూ? అంతా వాడిదయ. ఇది వస్తుందన్న ఆశ నాకైతే లేదు. అయినా వచ్చింది. అంతా మూట. ఇరవైనాలుగూ, చాలవూ....

కాంత: ఓ చాలకేం, లక్షణంగా వెళ్ళిరావచ్చు. అయితే రేపేనా ప్రయాణం.

వేణు: శుభస్య శీఘ్రం అన్నారు. రేపటి వరకెందుకు? రాత్రిబండికే వెళదాం.

కాంత: సరే. పదండి బామ్మగారికీ సంగతి చెప్పొస్తా. ఆమెంతో సంతోషిస్తుంది.

(రైలు వెళ్ళేశబ్దం....జనం కోలాహలం)

[ఏడుకొండలవాడా, వెంకటరమణా, గోవింద, గోవింద.... ఆపద మొక్కులవాడా, వడ్డికాసులవాడా, గోవిందా, గోవింద—అని దూరంగా భక్తుల ప్రార్థనలు వినిపిస్తూ వుంటవి]

కాంత: ఏమండీ, బాబుచేత పదిరూపాయలు హుండీలో వేయించండి.

వేణు: బాబూ, యీ నోటు పట్టుకో, ఆఁ, ఆఁ అందులో పడేయ్ ఆ భలేవాడివిరా. చూశావా కాంతా, ఏడుకొండలవాడా వెంకటరమణా! గోవిందా!! గోవిందా!!

కాంత: అరే చంద్రం అన్నయ్యా, చూశారూ, చంద్రం అన్నయ్యకూడ వచ్చాడే ఏరా. రావనివచ్చావ్....

చంద్రం: ఇప్పుడుమట్టుకు రావాలని వచ్చానా యేమిటి? మీ ఇంటి కెళితే మీరు తిరుపతికి వెళ్ళారని చెప్పారు. మీ వెనకే వెతుక్కుంటూ వచ్చాను.

కాంత: పోనీలే వచ్చినవాడివి రానేవచ్చావుగాని, మ్రొక్కు తీర్చుకో. మళ్ళీ మళ్ళీ తిరగాల్సినపని వుండదు.

చం: మనదెప్పుడూ ఒకేమాట. నాయెద్దుని పందెంలో గెలిపించనివాడే వాడు సగం నమ్మకం పోయింది. అపుకు కోడెన్నా వుడితే కాస్త

నమ్మకం కుదిరేదెమో. దానికి పెయ్యమాడ పట్టింది. ఇంక వాడు మొక్కులేదు గిక్కూలేదు

శాంత: ఆ! ఆ!, అలా అనరాదురా అన్నయ్యా, అపచారం.

చం: అపచారంలేదు గిపచారంలేదు నాకన్నీ తెలుసులే. పదండి.

శాంత: మొండివాదన పనికిరాదు. మీరన్నా చెప్పండి.

వేణు: చిన్నపిల్లాడన్నా అయితే రెండు తగిలించి చెప్పొచ్చు ఇద్దరు బిడ్డల తండ్రికి మనం చెప్పే దేమిటి

చం: మాటల సందట్లో మరిచాను. బావగారూ మీకు మొన్ననే అసిస్టెంట్ ఆఫీసర్‌గా ప్రమోషన్ వచ్చిందట మీ ఆఫీసు క్లర్కు రంగనాధం అన్నాడు. మీకు చెప్పమనికూడా చెప్పాడు.

శాంత: చూశారూ. అంతా వాడిదయ! మీరిక్కడే ఉండండి. ఓమారు స్వామి దర్శనం చేసుకొస్తా.

వేణు: నిజమేనా నీ మాటలు? చంద్రం బావా.

చం: ఇందులో అబద్ధ మాడాల్సిన పనేముంది? కష్టపడి చదివిన చదువుకు ప్రతిఫలం లేకుండాపోతుందా?

వేణు: ఇంతకీ వాడిదయ వుండాలి. ఇన్నాళ్ళనుండి అనుభవం అనుకొన్నది ఇంత త్వరగా వచ్చిందంటే, వాడిదయ కాక మనదేముంది? అయితే రేపే వెళ్ళి—

చం: అలా వీలులేదు అలా అంటాడనే ముందుగా టిక్కెట్లుకొని తెచ్చాను చూడు, రెండురోజులుండి వెళ్ళండి. మీ ఆఫీసర్ హోదాని లోటురానీయములే బావా

వేణు: దానికాదు, త్వరగా చేరితే మంచిదని. శాంతా చూశావా మీఅన్న ఎంత పని చేశాడో?

శాంత: ఎంతపని చేశాడేమిటి? చక్కని శుభవార్త మోసుకొచ్చాడు!

వేణు: అంతవరకు బాగానేవుంది. కాని, ఏకంగా టిక్కెట్లు పట్టుకొచ్చాడు. మావూరొచ్చి రెండురోజులుండి వెళ్ళమంటున్నాడు.

శాంత: పోనీలెండి. నాన్నగార్ని చూసికూడా చాలా రోజులయింది

వేణు: అవునుమరి నీవా అన్నకు చెల్లెలువేగా? అందులో వెళ్ళేది పుట్టింటికాయె, సరే పదండి.

(రైలు వచ్చివెళ్ళిన శబ్దం)

శాంత: ఎంతసేపని ఇలా నిరీక్షిస్తూ కూర్చుంటాం? అసలు మీరిచ్చిన టెలిగ్రాం నాన్నగారికి అందిందోలేదో? పోనీపెట్టె,బెడ్డింగ్ స్టేషన్ లో పెట్టి మనం నడిచి వెళదామా?

చం: పసిపిల్లాడితో ఎంత దూరమని నడుస్తాం? అందులో ఆఫీసరైన బావగార్ని నడిపిస్తే బాకే మర్యాద?

వేణు: మరేం ఫరవాలేదు. నేను నడుస్తాను ఎటొచ్చీ నీవు మాత్రం అల్లుణ్ణి బుజాలమీద ఎక్కించుకోవాలి.

చం: బుజాలు ఎక్కేకాలం ఇంకాముందుంది. ఇప్పటినించే మొదలెడితే మరీ కష్టం. పోనీ మీరిక్కడే వుండండి నే త్వరగావెళ్ళి బండి తోలుకొస్తాను.

శాంత: ఏం వద్దులే అన్నయ్యా. నాన్నగారొస్తున్నారు. బహుశా బండి కూడా వస్తుంటుంది. లేదాబూ లే తాతయ్య వస్తున్నాడు. లేరా, మొద్దూ. ఒట్టి మొద్దునిద్రండి వీడిది.

వేణు: మొద్దునిద్ర, తిండిబోతుతనం. అన్నీ మేనమామ లక్షణాలే వచ్చాయి.

రామయ్య: (ప్రవేశము)—ఏమ్మా. శాంతా, చాలా సేపయినట్లుంది బండి జిగి. ఏం నాయనా వేణూ క్షేమంగా వచ్చారుగదా? సమయానికి వచ్చారు. ఇహ నాకేం భయంలేదు, పెందరాడే బండి కట్టుకొద్దామంటే అన్నీ అడ్డంకులే.

చం: అవి నీకెప్పుడూ వున్నవేలే నాన్నా. పోనీ మనబండిచ్చి వెంకన్నను పంపకూడదూ?

రామ: మన బండి ఇంకేం మనబండిరా! మొన్నవక్వారమంతెద్దు మన ఎద్దు నిన్నప్రొద్దుటినుండి మేత ముట్టలేదు. గుక్కెడు నీళ్ళు త్రాగలేదు. పైగా నోటెంట నురుగువస్తున్నది. నురుగు ముట్టిందో ఏమో. అసలు మనింటికేదో శని పట్టింది.

శాంత: అదేమిటి నాన్నా అలా అంటారు?

రామ: కాకపోతే మరేమిటమ్మా మూడురోజులనాడు మీ అల్లుడికి జ్వరం తగిలింది మరునాటికల్లా బ్రహ్మాండంగా పెట్టుకొచ్చింది. పక్కూరునుండి డాక్టరొచ్చి రాత్రి తెల్లవార్లూ జాగరణచేసి మళ్ళీ వస్తానని ఇప్పుడే వెళ్ళాడు ఈరోజు గడిస్తేగాని ఏమాటా చెప్పనన్నాడు.

చం: ఇప్పు డెలాగుంది నాన్నా?

రామ: అలాగేవుంది. మనకేం తెలుస్తుంది చెప్పు. చూడమ్మా, ఇంకెన్ని కష్టాలు రావాలిచెప్పు. అసలిదంతా మొదలు దొడ్లోవుండే పాడావు పోవటంతో ప్రారంభమైంది.

---


'Sportlight' కార్యక్రమములో అంతర్విశ్వవిద్యాలయ పరుగుల ఛాంపియన్ పి. రాజశేఖరన్‌తో డా! జె. పి. థామస్ పరిచయం.
[మద్రాస్, జనవరి 29]

చం: ఏమిటి నాన్నా మీరుచెప్పేది ఒంగోలు ఆవు పోయిందా?

రామ: అప్పుడేం అదీ నీవు వెళ్ళినరోజు వెంకన్న కొడుకు గొడ్లను తోలుకుపోయాడు తోటకి. తిరిగొచ్చి అప్పా. దూడా కనిపించ లేదని చెప్పాడు. పాపం, వెంకన్న మూడు రోజులనుండి తిరిగి తిరిగి సారిపోయాడు. అక్కడాడ మాత్రం కనిపించలేదు. ఒంటి మిధ్య నాకు దైవబలం చాలకున్నది.

కాంత: ఎంతకుకావాన్నా. కళ్ళనీళ్ళు పెడతావు. దీనికంతకూ కారణం ఉన్నయ్య మొక్కుతిననం. తిరుపతివచ్చి దేవుడికి మొక్కుకొన్న మొక్కులకూడా చెల్లించకుండా వచ్చాడు అందులో వడ్డీకాసుల వాడి వద్దనా యీ నిర్లక్ష్యం.

రామ: ఏంచేస్తాం తల్లీ. అసలు తెలియనివాడికైనా చెప్పొచ్చు లేక పూర్తిగా తెలిసినవాడికైనా చెప్పొచ్చు. కని ఇటూ అటూ కాని వాళ్ళకి చెప్పటం కష్టం. నా జీవితంలో ఇలాంటి కష్టాలు చూడ లేదు తల్లీ. నాదారిన నేవెళ్ళిపోయినా బాగుండేది.

చం: నాన్నా అలా అనకు. నా తప్పు నాకర్థమయింది

కాంత: ఇప్పుడయినా ఆ ఏడుకొండలవాడిని వేడుకోరా అన్నయ్యా. నీ కష్టాలన్నీ కడతేరుతయి!

రామ: వచ్చే చైత్రమాసంలోవచ్చి వడ్డీకాసులు చెల్లించి మొక్కు తీర్చు కుంటానని దణ్ణంపెట్టుకో. ఆపద మొక్కులు ఎక్కడయినా ఎప్పుడయినా మొక్కుకోవచ్చు.

చం: స్వామీ చైత్రమాసంలో కొండకొచ్చి మొక్కు చెల్లిస్తాను. యీ కష్టాలు కడతేర్చి రక్షించు ప్రభూ, ఆపద మొక్కులవాడా! వడ్డీ కాసులవాడా! గోవిందా! గోవింద!

కాంత: నాన్నా మనకష్టాలు తప్పక తీరిపోతయి. మేము మొక్కు చెల్లించను ఇటు బయలుదేరగానే, వారికి ఆఫీసర్ పోష్టింగ్సు వచ్చాయి. మేము కలలోకూడా ఆఫీసర్ ప్రమోషన్ వస్తుం దనుకోలేదు. అంతా వాడిదయ.

రామ: లేకుంటే మరేమిటమ్మా. నీకొడుకు అటు వడ్డీకాసులు చెల్లించా దేమో, ఇటు అంతకు వందరెట్లు తెచ్చుకొన్నాడు.

వేణు: అదెట్లాగండీ మామగారూ!

రామ: అయితే నిన్న పేపరులో ప్రయిజ్‌బాండ్ ఫలితాలు చూడలేదా? బాబు పేరకొన్న టిక్కెట్టుకే ఫస్టుప్రయిజ్.

కాంత: అయితే బాబుకి ఏడువేల అయిదువంద లొచ్చేకాయా నాన్నా. ఎంతటి చక్కని పిదర్శనం స్వామి దయకు.

(విరామం)

కాంత: అన్నయ్యా, యింటికొచ్చేకాం స్నానంచేసి యిక్కడే చప్పున రెండు వెండిరూపాయలు ముడుపుకట్టి మళ్ళీ మొక్కుకో, అన్ని కష్టాలూ ఎలా వచ్చాయో అలా పోతయ్ నీ కొడుకను రక్షించే బాధ్యత వాడిపైనేవుంది. మరేం ఫరవాలేదు. స్వామీ దగులు వడకు. పెద్దవాడివి నీవే అలావుంటే, ఎట్లా?

రామ: అమ్మాయ్ కాంతా యిహా ఫరవాలేదుతల్లి. మనపై ఆ వడ్డీకాసుల వానికి దయ కలిగింది మీ అన్నయ్య మనసు కుదిరింది అవును దూడా తోటలోకివచ్చి మేస్తున్నదట మన పాలేరు వెంకన్న దాని కట్టేశాడట యిక మనకేం భయంలేదు. ఆ స్వామి మన పక్కనే ఉన్నాడు, అంతా వాడిదయ.

"ఏడుకొండలవాడా! వెంకటరమణా! గోవిందా! గోవింద! ఆపద మొక్కులవాడా! వడ్డీకాసులవాడా! గోవిందా! గోవిందా!

(అందరూ గోవింద కొడతారు.)



ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి: త్యాగరాజ ఆరాధన ఉత్సవము తిరువయ్యారునుండి రిలే (అఖిలభారత సంగీత కార్యక్రమం, జనవరి 27)

# కవితా రీతులు - చిత్రకవిత్వము

రాపూరి దొరసామిశర్మ

ఛందోబద్ధమగు పద్యరచనను సాధారణముగా కవితయని వ్యవహరింతురు. ఈకవిత - ఆశు, మధుర, చిత్ర, విస్తరములని నాల్గువిధములు. ఆశుకవిత అనగా అడిగిన వెంటనే త్వరితగతిఁ జెప్పు కవిత. అష్టావధాన శతావధానములిందుఁ జేరును. మధుర కవిత — దేశికవితాభేదములగు పదములు రగడలు. ఉదాహరణములు, యక్షగానములు మున్నగు రచనలు, చిత్రకవిత యన్నది అక్షర శబ్దచిత్రములఁ గూర్చిన కవిత, విస్తరకవిత - ఇతిహాస పురాణ ప్రబంధాది రచన. చతుర్విధ కవితారీతులలోఁ జిత్రకవిత యొకటి. ఈ చిత్ర కవితయందు మఱి మూఁడు తెఱఁగులున్నవి. అవి శబ్దచిత్రకవిత, బంధకవిత, గర్భకవిత అన్నవి.

శబ్దచిత్ర కవిత — ఏకాక్షరి, ద్వ్యక్షరి, త్ర్యక్షరి, తలకట్లు, గుడులు, కొమ్ములు, ఏకపది, ద్విపది, త్రిపది, పాదభ్రమకము, పద్యభ్రమకము, అనులోమ విలోమము, ఓష్ఠ్యము, నిరోష్ఠ్యము, అచలజిహ్వము, అస్పర్శము. అక్షర గుప్తకము, పాదగోపకము లోనగు రచనలీ జాతికిఁ జెందినవి.

ఏకాక్షరి ద్వ్యక్షరి యనఁగా ఒకటి రెండక్షరములతోడనే పద్యమల్లుట. తలకట్లు అనగా హల్లులన్నియు అకారస్వరముతోఁ గూడి యుండుట. ఇట్లె గుడులు, కొమ్ములు, ఏకపది — నాల్గు పాదము లర్థభేదము గలిగి యొకేతీరున నుండుట. ద్విపది పద్యమునఁ బూర్వార్థోత్తరార్థము లేకరీతినుండుట. చభబభమప - అను అక్షరముల వర్జించి వ్రాయుట నిరోష్ఠ్యము. వర్గాక్షరముల విడనాడి వ్రాయుట అస్పర్శము. తలక్రిందుగాఁ జదివినను నొకేతీరున నుండునట్లు వ్రాయుట భ్రమకము. మొదటి నుండి తుదివరకుఁ జదువునట్లు తుదినుండి మొదటికిఁ జదివినను నర్థవంతమైన పద్యమగుచో అది అనులోమ విలోమ చిత్రమనఁ బడును. చతుర్థపాదము వ్రాయక యా పాదాక్షరములు తొలి మూఁడు పాదములందే యెడనెడఁ గ్రమముగాఁ గూర్చి గోపనము సేయుట పాదగోపన మనఁబడును. ఇట్టిరచన బహువిధములు.

## బంధకవిత

చక్ర పద్మ ఖడ్గాద్యాకారములలోఁ జిత్రములు వ్రాసి వానియిండ్లలోఁ బద్యాక్షరముల నిముడ్చుట. కావ్యములలో గోమూత్రికా ఛత్రగుచ్ఛ కంకణనాగరథపుష్పమాలికాపద్మఖడ్గ చక్రాదిబంధములు ప్రసిద్ధములు. మఱి రథచక్రాది బంధములలో కవి యొక్కయు కృతిపతి యొక్కయు నామాక్షరములు వచ్చునట్లు గూర్పఁ బడును.

## గర్భకవిత

ఒక పెద్ద పద్యములోపల ఒకటి గాని యంతకన్న నెక్కువగాని చిన్న పద్యముల తత్తచ్ఛందోలక్షణము లను భంగములేక యిమిడించుట. చంపకమాలయందు మొదటను తుదను గొన్నియక్షరముల దొలఁగించి చదివిన కందము గీతము వచ్చును. దీనిని కందగీత గర్భ చంపకమాలయందురు. కొన్నికొన్ని పద్యములందు కొన్నికొన్ని పద్యములు గర్భితములుగామండ వీలున్నది. ఇట్టివే మత్తేభగీతకందగర్భ సీసము, స్రగ్విణీగర్భభుజంగప్రయాతము, కందగర్భమణిగణనికరము, కందద్వయ కమలవిలసిత రుగ్మవతీ గర్భక్రౌంచపదము, చతుర్విధ కందము మున్నగు ప్రసిద్ధగర్భపద్యములు గలవు.

ఒక పద్యములోనే యీమూఁడు విధముల చిత్రములఁ గూర్చుటయుఁ గలదు. బహువిధ చమత్కారంబుల చిత్రంబులు రచియింపుటఁజేసి యిది చిత్రకవిత్వమనఁబడుచున్నదని లక్షణదీపిక వివరించెను.

చిత్రకవిత లొనరు శితిమన్న
చెప్పిన
వృత్తగర్భితముల నెరఁగి కొన్ని
పద్మచక్రనాగబంధాదులను
గొన్ని,
యమక భేదగోపనములఁ
గొన్ని....

అని చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహములోఁ జిత్రకవితను విరూపించెను. అప్పకవియుఁ జిత్రబంధ గర్భకవితలను మూఁడుభేదములుగాఁ జేకొని యుదాహరించెను.

ఈ చతుర్విధ కవితా ప్రస్తావము తొలుదొలుతఁ దెలుగు భాషలో నన్నయ భారతావతారికలోఁ గానవచ్చెడు. మృదుమధుర చిత్రవిస్తర నవరస భావభాసుర కవితా రచనా విశారదులైన మహాకవులు రాజనరేంద్రుని కొలువులో నున్నారఁట. శ్రీనా

ధుడును శృంగార నైషధమున ప్పుడుమపర చిత్రవిస్తర కవితా విలాస వాగీశ్వరులగు కవీశ్వరులను అని నన్నయ పద్ధతిలో వ్రాసెను. ఇంక ఆతని వనుటకు బహుళ వ్యాప్తి వనియున్నది. నన్నయ శ్రీనాథుల తర్వాతివారలు ఆతని కవితయనిదే చెప్పిరి అష్టభాషల మధురాతి విస్తర చిత్ర కవితలు చెప్పు నక్కవుల మెచ్చ [షోడశకుమార చరిత్ర] అతి మధుర చిత్ర విస్తార కవితావిజృంభణ స్తంభిత బాణభవభూతి కాళిదాస ముఖ్య విఖ్యాత గౌరవుఁ గుకవులను [కళా పూర్ణోదయము] ఆశువు మధురము చిత్రము విస్తరముగాఁ జతుర్విధ కవితలు [ప్రబంధరాజము]

## ఆలంకారికుల మాట

తెనుఁగులోని చిత్రకవితా ప్రక్రియకు మూలము సంస్కృత భాషలోని చిత్రకవితయనుట నిర్వివాదము. సంస్కృతభాషలోఁ జిత్రకవితా రచన ప్రాచీన కాలమునుండి కానవచ్చుచున్నది. కావ్యప్రకాశ, కావ్యాదర్శ, సాహిత్యదర్పణ, సాహిత్య రత్నాకర, ప్రతాపరుద్రీయాది సాహిత్యశాస్త్ర గ్రంథములందుఁ జిత్రకవితా విషయములు ప్రపంచింపఁబడి యున్నవి. సంస్కృతాలంకారికులు వ్యంగ్యస్పర్శలేనిది అధమకావ్యమని కావ్యత్రైవిధ్యమును నిర్వచించిరి. అందు చిత్రకావ్యమును అధమకావ్యముగాఁ బరిగణించిరి 'వ్యంగ్యస్యాస్పష్టత్వే అధమం కావ్యం చిత్రమితి గద్యతే' అని ప్రతాపరుద్రీయము. రసాపకర్షకమగుటచేఁ జిత్రకావ్యము అధమమతిలోఁ జేర్పఁబడినవి. అలంకార శాస్త్రములలో చిత్రకవితను శబ్దాలంకార ప్రకరణములోఁ జేర్చి చెప్పియున్నారు. అలంకార శాస్త్రములందేకాక, భారవి కిరాతార్జునీయము మాఘుని శిశుపాలవధ మున్నగు మహాకావ్యములందు చిత్రకవితా రచనలు మిక్కిలి చేయఁబడియున్నవి. ఇవిగాక యమకరత్నాకరము: యమకార్ణవము, చిత్రరత్నాకరము, లోనగునవి సంపూర్ణ చిత్రకావ్యములు. అతి దుష్కరములైన రాఘవయాదవీయ, నలహరిశ్చంద్ర అను లోమవిలోమ చిత్రకావ్యములను ఆభాషలో పేరిచినవి. సంస్కృతము ననుసరించి కన్నడ కవిరాజమార్గమునను, తమిళ దండి అలంకారమునను చిత్ర కవితా రీతులు చూపఁబడినవి.

ఆది కవియగు నన్నయ భారతావతారికలో కవితారీతులలో చిత్రకవితను పేర్కొన్నాఁడే కాని, గ్రంథమందెందును దానిని జూపలేదు. చిత్రకవితను ప్రథమముగఁ బ్రదర్శించిన వాఁడు కుమారసంభవ కావ్యకర్త నన్నెచోడుఁడు. ఇతఁడు నాగమురజ చక్రబంధములు, చతుర్విధ కందము కందగర్భచంపకము అను చిత్రరచనలఁ గావించెను. ఛందోలక్షణ గ్రంథకర్తలు పలువురు వివిధ చిత్ర కవితారీతుల లక్ష్యలక్షణములఁ జూపిరి. మన యెఱుకకు వచ్చినంతలో నీ కవితా ప్రక్రియను లక్షణగ్రంథములోఁ బ్రవేశపెట్టిన ప్రథమలాక్షణికుఁడు కావ్యాలంకార చూడామణి కర్తయిన్న కోటపెద్దన [౧౨వ శతాబ్ది] తరువాత లక్షణసార సంగ్రహము, సరస భూపాలీయము, అప్పకవీయం మున్నగు లక్షణగ్రంథములలో చిత్ర కవితారీతులు విశేషముగాఁ జెప్పఁబడినవి.

## చిత్ర కవితారచనలు

కొందఱు కొందఱు మహాకవులు తమ కావ్యములందు కొంచెముగానో గొప్పగానో యీ చిత్రకవితను జూపియున్నారు.

అమఘనసారము, ఉత్తర హరివంశము, జైమిని భారతము, పారిజాతాపహరణము, కళాపూర్ణోదయము, హంసవింశతి, ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము, రసిక జన మనోభిరామము, సమీరకుమార విజయము, దశావతార చరిత్ర, కవి రాజమనోరంజనము పాపరాజు ఉత్తర రామాయణము, రావణ దమ్మీయము, మున్నగు పద్యకావ్యములందు నానావిధ బంధగర్భ చిత్ర కవితా రచనలు వెలయుచున్నవి.

ఈ చిత్రకవిత 11వ శతాబ్దిలో నన్నయచేఁ బ్రస్తావింపఁబడి 12వ శతాబ్దిలో నన్నెచోడునిచేఁ బ్రయుక్తమైనను 16వ శతాబ్దినుండి అనఁగా రాయలకాలము నుండి విస్తరిల్లఁ దొడగినది. 17వ శతాబ్దమున నీ కవితాప్రక్రియ పరాకాష్ఠనందినదని చెప్పవచ్చు. అప్పకవి కించుక తర్వాతివాఁడగు గణపవరపు వేంకట కవి రచించిన ప్రబంధరాజమామూలాగ్రము చిత్రకవితా ప్రచురము. దీనివంటి చిత్రకావ్యము మఱియొక్కటిలేదు. ఇందలి యొకపద్యము చాపష్టిభేద చిత్రసీసము. అరువదికి మించి బంధగర్భ చిత్రకవితారచనలిందిమిడియున్నవి. అర్వాచీన కాలమున మండపాక పార్వతీశ్వరశాస్త్రి బంధకవితకు లక్షణగ్రంథము నంతరించెను. దానిపేరు ప్రబంధసంబంధబంధనిబంధన గ్రంథము. మాడభూషి వేంకటాచార్యులు భరతాభ్యుదయమునను, కొక్కొండ వేంకటరత్నం పంతులు బిల్వేశ్వరీమునను, వావిలికొలను సుబ్బారావు శ్రీ కుమారాభ్యుదయమునను చిత్రరచన లతిమాత్రముగాఁ బ్రదర్శించిరి. ఈ శతాబ్దిలో నాదెండ్ల పురుషోత్తమ కవిగారి యద్భుతోత్తర రామాయణము అద్భుత చిత్రకవితా విధానము. నాచన సోమనాది ప్రాచీన కవులు నిరోష్ఠ్య పద్యములు గొన్ని వ్రాయుటఁ జూచి తర్వాతివారు నిరోష్ఠ్యకావ్యములు నిర్మించిరి. అల్లసాని పెద్దన చతుర్విధకవితా నిర్వాహకుఁడనని, తెనాలి రామకృష్ణుడు పలుదెఱంగుల నెన్నఁగల కావ్యధారల ఘనుఁడని చెప్పుకొన్నారుగాని వీరు గ్రంథములలో చిత్రకవితను చూపలేదు. మఱి రామరాజభూషణుఁడు, గణపవరపు వేంకటకవి, కంకంటి పాపరాజు, గట్టు ప్రభువు, ఎల్లమరాజు సుబ్రహ్మణ్య కవి, చెంగల్వ కాళకవి, తంజావూరి విజయరాఘవ నాయకుఁడు మున్నగు

కవులు తాము పతద్విధ కవితా విశ్వాహకులమని గ్రంథస్థము చేసికొన్నారు.

### గర్భ కవిత

పరిశీలింపగా తెలుఁగు వాఙ్మయమున నీ చిత్రకవిత సంస్కృతము నందుకంటె విస్తరించి యున్నదని చెప్పక తప్పదు చిత్రకవితాభేదమగు గర్భకవిత తెలుఁగులోనే తప్ప సంస్కృతమునఁ గానరాదు

కవితారచనలో వైవిధ్యము తప్ప వినరి శబ్దార్థముల రెంటికి సాహిత్యము కావ్యమనియాలంకారిక నిర్వచనము. అందు శబ్ద ప్రాధాన్యమునకు సాధనము శబ్దాలంకారములు. కావ్యాంగకు ఇవి చాల శోభాకరములు. ఈ శబ్దాలంకారములలోఁ జేరినదే కదా చిత్రకవిత? యమకాది చిత్రబంధక్రమములు బహుళములు వానిగతి భాషాకావ్యములకు నుచితములైచను అని చిత్రకవితకు స్థానం కల్పించినాఁడు చిన్నకోట పెద్దన, ఆశుకవిత్వంబులల్లితే నే సరా చిత్ర ప్రబంధముల్ సేయవలదే? అన్నది ముద్దువళని. కవుల మంచంతితగా నల్లితేగాదు, చిత్రప్రబంధముల్ సేయవలయు అని పునరుద్ఘాటించినాఁడు వేణుగోపాల శతక కర్త

### రుచి భేదము

కావ్యాలోకకర్త రినభావాది విషయ వివక్షా విరహేసతి అలంకార నిబంధోయన్నచిత్ర విషయోమతః అని యీ కవితారీతి నుపయోగము నిర్దేశించెను చిత్రరచన యుత్తమ కావ్యము కాకున్నను జదువరులకు రుచి భేదము గలిగించుటకు నీ రచనా వైచిత్రిని మహాకవులను తమ యుత్తమ కావ్యములలోఁ గ్వాచిత్కముగాఁ గావించియున్నారు. ప్రాచీను లగు నన్నిచోడ నందితిమ్మనాదులు కథాకథనమందుఁగాని రసమందుఁగాని వర్ణనయందుఁగాని సంబంధములేని దేవతాస్తుతిలోను ఆశ్వాసాంతములోను జగూర్చెడు సంబోధనాంత పద్యములందీ త్రివిధ చిత్రకవితను బొసఁగించి తమకవితా ప్రౌఢిమను బ్రకటించిరి నన్నిచోడుడు శివస్తుతియందు, నందితిమ్మన నారద ప్రణీత కృష్ణస్తుతియందు, ధరణిదేవుల రామమంత్రి దశావతార చరిత్రలో బ్రహ్మాదికృత రామస్తుతియందు దీనివిప్రాపిరి. కాని 17-18 శతాబ్దములలో వెలసిన చిత్రకవులు కథాసందర్భములందే బహుళముగాఁ జొప్పించి నీరసముగావించి చిత్ర కవితపై నేవగింపును బుట్టించిరి. చిత్రకవితా రీతులఁ దెలుపుటకై మచ్చుకుఁ గొన్ని యుదాహృతులు:—

పారిజాతము-ద్వ్యక్షరి....

[రెండక్షరములతోనే చెప్పఁబడిన పద్యం]

మననమున ననుమానము నూ
నను. నీనామ మను మను
మననమును. నేను
మున్న మాన, నన్ను మన్నన
మని
మను మను, నానామునీన మానా
మూనా,

అప్పకవీయము —నిరోష్ఠ్యము ..

[పవఫబభమవ అను అక్షరములు విడిచిపెట్టి చెప్పిన పద్యము.]

నరహర్యక్ష, దయాకర,
కరిరక్షణ చక్రహస్త కాంచన
చేలా
గరుడ తురంగ, జనార్దన
ఖరదైత్యనికృంతన హరి,
కంజదళాక్షా.

రథబంధము . [మదీయము]

శ్రీక, చంద్రాభభద్రకీర్తీ, ప్రభావ
శేవధీ, శంకరనిభా, అలావళీని
రాన, చతురేంద్ర, మస్కరిరాజ,
చంద్ర
మౌళి, జోహారు, భాను సంస్ఫా
రకాంతి

ఈ బంధమధ్యమున— శ్రీ చంద్రశేఖరేంద్ర భారతి— అను పేరు వచ్చును

అప్పకవీయము —

[కందగీతగర్భ చంపకమాల]

నరహరి కేశవా వనజనాథ రమా
ధవ వంశహస్త బం
ధుర సుగుణాకరా దురితదూర
జనార్దన దోర్బలాఢ్య గి
ర్వర గిరిశస్తుతా మురహరాసుర
పూజిత ముఖ్యపాద సుం
దరపురుషాగ్రణీ భుజగతల్ప
శచీపతి పుత్ర రక్షకా.

గర్భిత కందము .

హరి కేశవా వనజనా
థ రమాధవ వంశహస్తబంధుర
సుగుణా
గిరిశస్తుతా మురహరా
సురపూజిత ముఖ్యపాద సుందర
పురుషా.

గర్భిత గీతము....

వనజనాథ రమాధవ వంశహస్త
దురిత దూర జనార్దన
దోర్బలాఢ్య
మురహరాసురపూజిత ముఖ్య
పాద
భుజగతల్ప శచీపతి పుత్రరక్ష.

కవితావినోదము గూర్చు నీ చిత్రకవితాప్రక్రియ తెలుఁగు వాఙ్మయములోఁ బ్రత్యేకశాఖగాఁ బరిగణింపఁదగినది. దీని విషయమై పరిశ్రమ చేసినవారరుదు ఆంధ్రవాఙ్మయమంతయుఁ బరిశీలించి లక్ష్యలక్షణములఁ బ్రదర్శించి చిత్రకవితా వాఙ్మయమును సంతరించుట యావశ్యకము



(2వ పుట తరువాయి)

దీన్ని గుది గుచ్చాడు. అంతే కాదు తన ఎనభయ్యవ యేట వ్రాసిన రూప్ కథ అనే పాటలో దీన్ని ధ్వన్యాత్మకంగా వాడుకున్నాడు. ఆయన అవసాన కాలంలో వ్రాసిన పాటలన్నిటి. అది చాల అర్థవంతమైనదీ శ్రావ్యమైనదీను.

## నౌకా గృహములోనే నివాసము

టాగూర్ తండ్రి ఆయనకు కుటుంబ జమీమీద పెత్తనం ఇచ్చాడు. ఆ జమీ, మధ్య ఉత్తర బెంగాలులో విస్తరించి వుండేది, 1891 లో టాగూర్ అక్కడికి వచ్చాడు. దానికి శాశ్వతమైన ప్రధాన స్థావరమంటూ లేదు. ఆ జమీకి మూడు చోట్ల మూడు కచేరీలు. ఆ స్థావరాలు మూడూ పద్మానది పాయలమీదనో, ఉపనదులమీదనో వుండేవి. ఆయన ఆ స్థావరాలలోని నివాసగృహాలలో మార్చి మార్చి వుంటుండేవాడు. కాని ఆయన ఎక్కువగా నదిమీద నౌకాగృహంలోనే పగళ్ళూ, రాత్రిళ్ళూ గడిపేవాడు. నదీమయమైన ఈ ప్రదేశానికి రావడం, ఆయనకు నిత్యమైన జానపద వంగదేశం యొక్క హృదయంలో ప్రవేశం దొరికినట్లయింది. ప్రకృతీ మానవుడు సమగ్ర సమన్వయం పొందిన ఈ నూతన పరిసరాలలో ఆయన కెక్కువ ఆసక్తి కలిగింది. ఆయన కవితా శక్తి తన మార్గాలలో విజృంభించింది. ప్రకృతి తోటీ మానవుని తోటీ ఒక నీరవ ప్రశాంత సామరస్యభావం ఆయన పద్యాలలో పలుక నారంభించింది. ఆయన భావన ధ్వని ప్రధాన చిత్రాలను రూపు కట్టింది. భారతీయ సాహిత్యంలో అంత వరకూ లేని కథానికలను వ్రాయడం అప్పుడే ఆయన మొదలు పెట్టాడు. రాగ భావ వికారాలను పసిపిల్లల సంప్రదాయం బాగా తెలిసిన స్త్రీల కథా కథన పద్ధతీ తెలిపే జానపద సంప్రదాయం స్వాభావికంగా ఆయన్ను ఆకర్షించింది.

నదీపోషిత జానపద వంగ దేశంలో టాగూర్ నివాసము ఏర్పాటు చేసుకోవడం, 'సాధన' అనే మాసపత్రిక ప్రచురింపబడడం రెండూ ఒకేసారి జరిగాయి. ఆ పత్రికనిండా టాగూర్ గద్యరచనలూ, పద్యరచనలే. 1892 లో టి. ఎన్. ముఖర్జీ రచించిన 'ఏకంకవతి' అనే అద్భుత నవల ప్రకటితమైంది. దానివల్ల జోల పాటలలోని రాగభావ వికారాల అగాధత్వం టాగూర్ దృష్టికి వచ్చింది. రవీంద్రనాథ్ ఆ నవల మీద సాధనలో మంచి సమీక్ష వ్రాశాడు ఆ లో జానపద వాఙ్మయము యొక్క విలువను నిరూపించాడు.

ఒక సంవత్సరము తర్వాత రవీంద్రనాథ్ బెంగాలీ భాషలోని జోలపాటలను గురించి పెద్ద ఉత్తమ వ్యాసము వ్రాశాడు అది 'సాధన'లో వచ్చింది. ఆ వెంటనే సాహిత్య పరిషత్ పత్రికలో అలాటి జోలపాటల సంకలనాన్ని ప్రకటించాడు. ఈ రెంటితో టాగూర్ జానపద సంప్రదాయాన్ని మనదృష్టికి తెచ్చాడు, కుతూహలులైన పాఠకులు వారివారి ప్రాంతాలనుంచి వివిధ జానపద గేయాలను సంతరించవలసిందిగా ఆయన కోరాడు. ఏతత్ ఫలితముగా 1896 లో జోగీంద్రనాథ్ సర్కార్ ఒక మంచి జోల పాటల సంపుటిని ప్రచురించాడు దాని పేరు. "ఖుకుమనీర్ ఛారా"

1891 నుంచి వ్రాయబడిన ఖండకావ్యాలలో చాలా వాటికి టాగూర్ జానపద వాఙ్మయము నుంచి వస్తువులను తీసుకున్నాడు. ఆయన ఈ నూతన పరిసరాల్లో రచించిన ప్రథమ పద్యకావ్యం 'సోనార్ తరీ' లోని, 'బింబవతి', 'రాజు కొడుకులు, రాజు కూతురు'. 'నిద్రిత', 'సుప్తోత్థిత' మొదలైన వాటిని ఉత్సుకులు చూడవచ్చును మరికొన్ని ఖండ కావ్యాలో టాగూర్ జానపద వాఙ్మయ పద్ధతినే అవలంబించాడు. 'కల్పన'లోని 'హిన్-దిన్-చట్' ఇందు కొక ఉదాహరణం జానపద కథవిభాగంలో గుప్తార్థకలితమైన కథ ఒకటి టాగూర్ కు పూర్వం దాన్ని బెంగాలీ వాఙ్మయము ఎరుగదు. సోనార్ తరిలో 'పరశువేది' అని ఆకాశములో చంద్రుడు' అనీ, అలాటి చక్కని ఖండకావ్యాలు రెండు వున్నాయి.

## చాలా చిన్న పాత కథ

తాను వ్రాసిన కొన్ని ఉదాత్త కథానికలలో కూడా రవీంద్రనాథ్ జానపద భావపద్ధతిని వాడినాడు. అలాటి వాటిలో మొదటిది 1893 జూన్ లో వ్రాసిన 'అసంభవకథ'. అందులో వస్తువు తన పూర్వ స్మృతులనుంచి తీసుకున్నా దాన్ని అతిపరిచితమైన 'ఒక్క అద్భుత కథ అనే చట్రములో బిగించాడు. ఆ తర్వాత నెలలో ఇంకొక కథ వ్రాయబడ్డది. దానికి నమూనా ఈసప్ కథలు. వస్తు వేమంత బరువైనది కాదు కాని దానిని ప్రదర్శించిన తీరు మాత్రం సుస్పష్టంగా ఉత్సుకతను రేపే టట్లుగా వుంది. టాగూర్ దృష్టిలో బెంగాలీ సాహిత్య సమకాలిక విమర్శ యొక్క విలువ ఎలాటిదో అది మనకు తెలుపుతుంది. దాని పేరు 'చాలా చిన్న పాతకథ' ఉల్లాంపిట్టా చిలుత పక్షీ, ఇవి రెండూ సృష్ట్యాదినుంచి ఒక పని తమ మీద పెట్టుకున్నాయి అదేమిటంటే, భూమి అంతా బురద అనీ, దానిమీది జీవమంతా కుళ్ళు అని నిరూపించడం ద్వారా వాటి పనికిమాలినతనాన్ని వెల్లడించడమే. అందుకని, ఒకటేమో ఎడతెగకుండా భూమిపై మెత్తటి భాగాన్ని ముక్కుతో పొడుస్తుంటుంది. రెండోది చెట్ల మెత్తటి బెరడును నిరంతరం తొలుస్తుంటుంది.

## జానపద రచనా పద్ధతి

ముప్ఫయి యేండ్ల తర్వాత కథానికా శరీరానికి ఏమాత్రమూ ఒదుగనట్టివీ కవిత్వానికి పనికి రానట్టివీ అయిన రచనలు చెయ్యడానికి రవీంద్రనాథ్ మళ్ళీ జానపద రచనా పద్ధతిని చేపట్టాడు వాటికి ఒక వింత జానపద కథా స్వరూపాన్ని కూర్చాడు వాటి శైలి గద్యానికీ పద్యానికీ మధ్యస్థంగా వుంటుంది.

1922 లో 'లిపిక' అనే సంపుటిలో అవి సంకలనం చేయబడ్డాయి. 'రాజపుత్తర్', 'పరీర్ పరీచీ', 'కత్తార్ భూత్', 'తోతా-కాహినీ', అనేవి. వాటిలో బాగా ఎన్నదగినవి. 'రాజపుత్తర్' ఒక బీద కాలేజీ విద్యార్థియొక్క మామూలు పనులను చెబుతుంది కాని జీవిత సమస్యలను ఎదుర్కోవడంలో యొక్కవోని మానవ సాహసాన్ని తెలిపే గుప్తార్థ ప్రతీకగా అది మహాకావ్య గౌరవాన్ని అందుకుంది ఆ కథనుంచి కొన్ని పంక్తులు ఉదాహరిస్తాను:

''ప్రపంచంలో ఇతరులంతా భాగ్యాన్నీ కీర్తినీ సుఖాన్నీ అన్వేషిస్తుంటారు. కాని మన రాకుమారుడు రాక్షసి నిర్బంధం నుంచి రాకుమారిని తప్పించడానికే కృత నిశ్చయుడైనాడు. తుఫానులు చెలరేగుతున్నాయి. పడవ ఎక్కడా కనపడడం లేదు. కాని రాకుమారు డింకా దారి కోసం వెతుకుతూనే వున్నాడు. ఇది సర్వకాలములందూ అన్ని ప్రదేశాలలోనూ మానవజాతి ఆరాధించే అద్భుత కథలలో ప్రధానమైంది. రాజకుమార్తె నిర్బంధంలో వుంది, సముద్రం అలంఘ్యంగా వుంది రాక్షసుడు అజేయుడు అయినా ఆ కుర్రవాడు నిస్పృహోయుడై నిలబడి, 'నేను రాకుమారిని రక్షించి తీసుకువస్తాను,' అని ప్రతిజ్ఞ చేస్తున్నాడు. ఈ అమర సందేశాన్ని ముసలమ్మలు కొత్తగా పుట్టిన బిడ్డలకందివ్వాలి.''

ఏ పనికైనా స్వతంత్రించి పూనుకోలేని మన స్వభావాన్ని, బాధ్యతను తప్పించుకు తిరిగే ప్రవృత్తినీ, 'కత్తార్-భూత్'-యజమానియొక్క దయ్యము-ఖండిస్తుంది. మన దేశములో వుండే విద్యావిధానము మీద 'తోతా-కాహిని'-చిలక కథ-ఒక నిశిత విమర్శ అది వ్రాసి నలభై రెండు ఏండ్లయినా దాని ప్రయోజనం ఇప్పటికీ పోలేదు.

## సాన పెట్టని రాళ్ళు

ఇరవై యేండ్ల తర్వాత, ఎనభయ్యో యేడు దగ్గరపడుతున్నప్పుడు పిల్లలకు పనికివచ్చే పద్యాలు జానపద సంప్రదాయములో వ్రాయాలని టాగూర్ కు ప్రబలమైన కోరిక కలిగింది. అలా వ్రాసినవన్నీ 'ఛరేర్-ఛబీ' లోనూ 'ఖాప్ఛరా' లోనూ సంకలిత మయ్యాయి 'ఖాప్ఛరా' లోని విపరీత భావపూరితమైన పద్యాల కన్నిటికీ టాగూరే బొమ్మలు వేశాడు అవి చిన్న వాళ్ళ కుద్దేశింపబడినవైనా పెద్ద వాళ్ళ కౌతుకాన్ని కూడా రేకెత్తిస్తాయి. 'ఖాప్ఛరా' సంపుటికి తోడైంది, 1937 లో వ్రాసిన 'వాడు' అనే గద్యసంపుటం కథానాయకుని సాహసకృత్యాలలో విపరీతమయిన సంఘటనలనూ, నవ్వుపుట్టించే సంఘటనలనూ, అది మనముందు పెడుతుంది. ఆ కథానాయకుడికి పేరు లేదు. కేవలం ఉత్తమ పురుష సర్వనామంగానే సూచింపబడ్డాడు, దానికికూడా టాగూర్ బొమ్మలు వేశాడు. 'వాడు'యొక్క అంకిత పద్యాలలో ఆ విపరీత కథలకు గల కారణాన్ని, ఆ బొమ్మల ఉద్దేశాన్నీ టాగూర్ ఇలా విశదీకరించాడు:

''ఊహానిలం చేత వీవబడి మనస్సు అట్టడుగునుంచి చిత్రమైన భావాలూ, దృశ్యాలూ పైకి పుటికి వచ్చాయి అవి హేతువు అనే సరిహద్దును దాటి అంతరించిపోతాయి. అవి సానపెట్టని రాళ్లు, సద్యస్స్ఫురణాలు, కలగాపులగంగా వంకర టింకరగా వున్నాయి, కొంత భాషతోనూ, కొంత కుంచెతోనూ అవి చూపు దిద్దుకున్నాయి. నా వంచి ఖాళీచేసి వాటి నన్నిటినీ మీకు సమర్పిస్తున్నాను''.

[తెలుగు అనువాదం:
నాయని సుబ్బారావు]




## అఖిల భారత కదంబ కార్యక్రమము

ఫిబ్రవరి 1-వ తేదీ గురువారం నుండి ఫిబ్రవరి 15-వ తేదీ గురువారం వరకు

(ఫిబ్రవరి 4, 11 ఆదివారములు మినహా)

ఉ॥ ప్రసారము I

42·13 మీ (7120 కిలోసైకిళ్ళపై)
41 32 మీ (7260 కిలోసైకిళ్ళపై)

7-00 అరుణోదయ సంగీత మంజరి
7-30 వందనవార్ భక్తి గీతావళి
8-00 ఝంకార్ వాద్య సంగీతం
8-15 స్వర్‌సంగమ్ కదంబ కార్యక్రమము
8-30 మధువన్
8-57 ఝరోఖా నేటి కార్యక్రమముల వివరాలు
9-00 ప్రసార సమాప్తి

ఉ॥ ప్రసారము II

52.27 మీ (11870) కిలోసైకిళ్ళపై
31 28 మీ (9590) కిలోసైకిళ్ళపై

11-00 ఇంద్రధనుస్సు కదంబ కార్యక్రమము
12-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము III

25·36 మీ (11830 కిలోసైకిళ్ళపై)
31·28 మీ (9590 కిలోసైకిళ్ళపై)

2-00 మనోరంజన్ మీరుకోరిన పాటలు
3-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

31·41 మీ (9550) కిలోసైకిళ్ళపై

కర్ణాటక సంగీత కార్యక్రమము

4-30 గీతమాలిక
4-45 అంజలి-గీతావళి
5-00 వాద్య సంగీత్
5-15 మధుర గీతం మీరుకోరిన పాటలు (బుధ, శుక్ర, ఆదివారములు)
6-00 గానామృత్ శాస్త్రీయ సంగీతము
6-15 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము V

31·41 మీ (9550 కిలోసైకిళ్ళపై)
41 32 మీ (7260 కిలోసైకిళ్ళపై)

6-30 బార్‌హార్ ప్రసిద్ధ పురాతన గీతాలు
6-45 ఉదయగాన్ దేశభక్తి గీతాలు, బృందగానము
7-00 పుష్పావతి మీరుమెచ్చిన పాటలు
7-30 గజరా గీతికా గుచ్ఛము
8-00 పత్రావళి శ్రోతల ఉత్తరాలు
8-10 రసవంతి సుగామ సంగీతం మీరుకోరినవి (బుధవారములు)
8-30 మన్-చాహే గీత్ మీరుకోరిన పాటలు
9-00 హవామహల్ నాటికలు, రూపకములు, హాస్య రచనలు
9-15 మంజూషా జానపద, ప్రాంతీయ సంగీతం
9-30 రాగ్‌రంగ్
9-42 ఝరోఖా రేపటి కార్యక్రమముల వివరాలు (శనివారములు మినహా)
9-45 ప్రసార సమాప్తి

ప్రత్యేక కార్యక్రమము

ఫిబ్రవరి 3, 10 శనివారాలు

రా॥ 9-45 నుండి 11-00 వరకు
60·38 మీ (5955 కిలోసైకిళ్ళపై)
10-00 నుండి 11-00 వరకు
41·32 మీ (7260 కిలోసైకిళ్ళపై)

9-45 నాదరంజని వాద్య సంగీతము
10-00 గీతమంజరి లలిత సంగీతం
10-40 రంగవాణి లలిత శాస్త్రీయ సంగీతం
10-57 ఝరోఖా వచ్చేవారపు కార్యక్రమాల వివరాలు
11-00 ప్రసార సమాప్తి

ఫిబ్రవరి 4, 11 ఆదివారాలు ముఖ్యమైన పండుగ దినాలు

ఉ॥ ప్రసారము I

42·13 మీ (7120 కిలోసైకిళ్ళపై)
41 28 మీ (7260 కిలోసైకిళ్ళపై)

7-00 అరుణోదయ సంగీత మంజరి
7-30 వందనవార్ భక్తిగీతాలు
8-00 ఝంకార్ వాద్య సంగీతం
8-15 స్వర్ సంగమ్ కదంబ కార్యక్రమము
8-30 గీతోంభరీ కహానీ పాటలతో కూర్చిన కథ
8-57 ఝరోఖా నేటి కార్యక్రమముల వివరాలు
9-00 ప్రసార సమాప్తి

ప్రసారము II

25·27 మీ (11870 కిలోసైకిళ్ళపై)
31 28 మీ (9590 కిలోసైకిళ్ళపై)

10-15 రంగావలి
10-45 రత్నాకర్ నాటికలు, హాస్యరచనలు, కథలు
11-00 బాగ్‌బహార్
11-30 చౌపరా మాటలు, పాటలు
12-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము III

25·36 మీ (11830 కిలోసైకిళ్ళపై)
31·28 మీ (9590 కిలోసైకిళ్ళపై)

2-00 మనోరంజన్ మీరుకోరిన పాటలు
3-00 అప్నాఘర్ మీ ఇంట్లో అందరికీ
3-30 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

31 41 మీ (9590 కిలోసైకిళ్ళపై)

కర్ణాటక సంగీత కార్యక్రమము

4-30 గీత మాలిక
4-45 అంజలి-గీతావళి
5-00 వాద్య సంగీత్
5-15 మధురగీతం మీరుకోరిన పాటలు (బుధ, శుక్ర, ఆదివారములు)
6-00 గానామృత్ శాస్త్రీయ సంగీతము
6-15 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము V

31·41 మీ (9550 కిలోసైకిళ్ళపై)
41 32 మీ (7260 కిలోసైకిళ్ళపై)

6-30 బార్‌హార్ ప్రసిద్ధ పురాతన గీతాలు
6-45 ఉదయగాన్ దేశభక్తి గీతాలు, బృందగానము
7-00 పుష్పావతి మీరుమెచ్చిన పాటలు
7-30 గజరా గీతికా గుచ్ఛము
8-00 పత్రావళి శ్రోతల ఉత్తరాలు
8-10 రసవంతి సుగమ సంగీతం
8-30 మన్-చాహే-గీత్ మీరుకోరిన పాటలు
9-00 హవామహల్ నాటికలు, రూపకములు హాస్య రచనలు
9-15 మంజూషా జానపద, ప్రాంతీయ సంగీతం
9-30 రాగ్‌రంగ్
9-42 ఝరోఖా రేపటి కార్యక్రమముల వివరాలు
9-45 ప్రసార సమాప్తి

ఇతర వివరములకు : ప్రొడ్యూసర్, 'వివిధభారతి' ఆకాశవాణి, పోస్టుబాక్స్ 4, బొంబాయి-1.

VANI—Printed at the Royal Printing Works, Madras-2—Edited and Published by the Station Director, All India Radio, Madras-4.







ఎమ్. ఎల్. వసంతకుమారి (మద్రాస్, ఫిబ్రవరి 2)

జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యం (మద్రాస్, ఫిబ్రవరి 9



ప్రత్యేక లలిత సంగీత కచేరీ (విజయవాడ) ఇటీవల ఆహూతుల సమక్షమున జరిగినది





ఈ కచేరీలో అతిథులుగా పాల్గొన్న

పి. బి. శ్రీనివాస్

మాధవపెద్ది సత్యం



జి. వైదేహి
(మద్రాస్, ఫిబ్రవరి 4)



వి. వంజులం
(మద్రాస్, ఫిబ్రవరి 11)



దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి ప్రసంగం—బాలికా చిత్ర తోళ్ళకు పాలివవేసేవాడు (హైదరాబాద్, ఫిబ్రవరి 1)